శ్రీః



శ్రీః

# శ్రీ పరమాత్మసహస్రనామావళీస్తోత్రమ్

సంస్కృతమూలమ్ వ్యాఖ్యా చ
శ్రీ బెల్లంకొండ రామరాయవిద్వత్కవిః
అనుసంధానమ్ (ఆంధ్రానువాద వ్యాఖ్యా)
శ్రీ మేళ్ళచెఱ్ఱువు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రీ



ప్రకాశికా
**రావి కృష్ణకుమారీ**
4–103, ఐ.ఎల్.టి.డి. కాలనీ ఎక్స్‌టెన్షన్,
కొత్తపేట–చీరాల–523 157

**శ్రీః**

# శ్రీ పరమాత్మసహస్రనామావళీస్తోత్రమ్

**సంస్కృతమూలమ్ వ్యాఖ్యా చ**
**శ్రీ బెల్లంకొండ రామరాయవిద్వత్కవిః**
**అనుసంధానమ్ (ఆంధ్రానువాద వ్యాఖ్యా)**
**శ్రీ మేళ్ళచెఱ్ఱ్వు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రీ, సంస్కృతాధ్యాపకః,**
**శ్రీ గోరంట్ల వెంకన్న సంస్కృత కళాశాలా, తిమ్మసముద్రమ్.**

**పృష్ఠ సఙ్ఖ్యా : 64**
**మూల్యమ్ : రూ. 10/-**
**ప్రథమ ముద్రణమ్ : పార్థివ నామ సంవత్సరః - 05.12.05**


4-103, I.L.T.D. Colony Extn.,
Kothapet, **Chirala-523 157**
☎ 08594 - 234054; Cell : 9440115411



**ప్రతులకు :**
**బెల్లంకొండ రామకోటేశ్వరరావు,**
**పమిడిపాడు**
**(వయా) నరసరావుపేట,**
**గుంటూరుజిల్లా.**

**D.T.P. at :**
**విక్రమ్ గ్రాఫిక్స్,**
**ఆంధ్రరత్న రోడ్ - చీరాల.**
**☎ 08594 - 233242**

**Printed at :**
**సూర్య ఆఫ్‌సెట్,**
**స్టేషన్‌రోడ్ - చీరాల.**
**☎ 08594 - 233943**



సంయన్తి వామాని శుభాని ప్రజానామేనమితి సంయద్వామః. 'సర్వం తదభిసమేతి యత్కిఞ్చ ప్రజాస్సాధుకుర్వ'న్తీతి శ్రుతేః. సర్వదేవనమసామేవ సిన్ధూనాం నదీనాం సరిత్పతిః. 'ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్. సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛ' తీతి స్మరణాత్. సర్వమత్ర సమ్యగన్వేతీతి సమన్వయః. వస్తుతస్త్వనన్వయః, అన్యస్యాభావాత్. అనన్వయ ఇత్యనేన అయమేవ అనేన తుల్య ఇతి వ్యజ్యతే. అనన్వయాలంకారస్య తథావిధత్వాత్. అః అవతీతి అః. 'అక్షరాణామకారో' స్మీతి గీతావచనా చ్చాకారస్య విష్ణునామత్వమ్. అతతేర్ధః అ ఇతి వా. ఇతి పూర్వోక్తైస్సహస్రనామభి ర్య ఉచ్యతే సోఽహమేవ, 'అహం బ్రహ్మ' స్మీతి శ్రుతేః. **బ్రహ్మవాచినాం సర్వేషాం బ్రహ్మభిన్న జీవవాచిత్వాత్.**

**అనువాదం :** ప్రజల యొక్క శుభములు ఈయనను చుట్టికొనును కనుక ఆత్మ 'సంయద్వాముడు'. 'ప్రజలు చేసిన శుభములు అన్నియు ఈ ఆత్మను చేరును' అని వేదవాక్యము. సర్వదేవ నమస్కారములు అనే నదులకు సముద్రం వంటివాడు. 'ఆకాశము నుండి పడిన నీరు సముద్రమును చేరినట్లు సర్వదేవతానమస్కారములు కేశవుని చేరును' అని స్మృతి. సమస్తం ఇందులోనే అన్వయించును కనుక 'సమన్వయ' స్వరూపుడు ఆత్మ. కాని నిజానికి సమస్తమునకు ఆయన అతీతుడు కనుక 'అనన్వయుడు'. ఆయనకన్న మిగిలినదంతయు మిథ్య కదా!. కనుక ఆయనకు ఆయనే సాటి కనుక 'అనన్వయుడు' అని చెప్పవచ్చును. ఇది అనన్వయాలంకారమనవచ్చును.

రక్షించువాడు కనుక 'అ' లేదా 'అక్షరాలలో తాను అకారమును' అని గీతావచనముల వలన అకారము విష్ణునామము. పూర్వోక్తమయిన యీ సహస్రనామములు అన్నియు ఎవనిగురించి వర్ణించినవో అతడు 'నేనే' 'అహం' అనగా నేను బ్రహ్మ=బ్రహ్మను' అని వేదవచనము. బ్రహ్మ వాచకములు అయిన పదములు అన్నియు బ్రహ్మ భిన్నమయిన జీవునకున్ను వాచకములే.

ఇతి బెల్లంకొండోపనామక రామకవి కృతిషు
పరమాత్మ సహస్రనామావళి మూలం సాల్పవ్యాఖ్యం
శ్రీ హయగ్రీవాయ సమర్పితమ్.
సౌమ్యసంవత్సర నిజశ్రావణ దశమ్యామ్.
**అనుసంధానమ్** సమాప్తము.

వృణుతే తేన లభ్య' ఇతి శ్రుతేః. యో ముక్తైర్లభ్యతే, యశ్చ ముక్తిం లభతే, తదుభయమయమేవ. ఏకాత్మత్వాత్తయోః. అసమాహితైరలభ్యః. యద్వా నిత్యలబ్ధత్వాదలభ్యః అనాప్యః. ఆప్యం హితకారి జన్యమనిత్యమ్. సర్వదా లబ్ధో నిత్యలబ్ధః లబ్ధత్వస్యావికారత్వాదలబ్ధా.

**అనువాదం :** ఆత్మ ప్రవచనాల వలన, మేథాశక్తి వలన చదువు వలన ఆత్మ లభించదు. అని వేదవాక్యము. అందువలన శాస్త్రాలభ్యము. ఆత్మను తెలియవలెనంటే 'ఆత్మ'యే అనుగ్రహించాలి. ఎవరిని ఆత్మ వరిస్తుందో అతడే ఆత్మను పొందగలడు' అని వేదవాక్యం. కనుక ఆత్మ 'లంభకము' అనగా తనను పొందించునది. మోక్షకాంక్షుల చేత పొందబడువాడు కనుక లభ్యుడు. పొందునదియు తనే కనుక 'లబ్ధ'యు తనే. అంతా తనే కనుక. పొందగల సమాధి లేనివారికి అలభ్యుడు. లేదా ఎల్లప్పుడు మనయందే ఉండువాడు కనుక కొత్తగా పొందదగినది లేదు కనుక 'అలభ్యుడు' అనవచ్చును. ఎల్లప్పుడు పొందబడినవాడు కనుక నిత్యలబ్ధుడు. పొందబడుట అనేది ఆయన యందు లేదు కనుక 'అలబ్ధ' గూడా ఆత్మయే.

**శ్లో॥ జ్ఞానలభ్యో భక్తిలభ్యో ధ్యానలభ్యోఽపి లాభవిత్।**
**లాభోఽలాభోఽన్యలాభస్స్వోఽనన్యలాభశ్చ లాభకృత్॥ 113**

య ఆత్మలాభం వేత్తి, స ఆత్మేవేత్యత అహ-లాభవిదితి. ఆత్మలాభోప్యాత్మ రూప ఏవేత్యత అహ-లాభ ఇతి. న విద్యతే లాభో యస్మాత్సః అలాభః. 'యం లబ్ధ్వాపరం లాభమ్మన్యతే నాధికం తత' ఇతి గీతావచనాత్. యస్మిన్ లబ్ధే సతి సర్వోఽపి తదన్యో లబ్ధో భవతి స ఉచ్యతే అన్యలాభ ఇతి. నాయమన్యైర్లభ్యత ఇత్యాహ అనన్యలాభ ఇతి.

**అనువాదం :** ఆత్మ ప్రాప్తి గురించి తెల్సినవాడు ఆత్మయే కనుక 'లాభవిత్' అని అనవచ్చును. ఆత్మను 'అలాభః' అనగా 'తనకు మించిన లాభం లేనివాడు' అని అనవచ్చును.

**శ్లో॥ సంయద్వామస్సర్వదేవ సమస్సింధుసరిత్పతిః।**
**సమన్వయోఽనన్వయశ్చేత్యుచ్యతేయోఽహమేవ సః॥ 114**



# "చిక్రోడనమ్"

సుప్రసిద్ధ విద్వత్కవి అద్వైతదర్శనానికి అపరశంకరులు అయిన శ్రీ బెల్లంకొండ రామారావుగారు శతాధిక గ్రంథకర్త అన్న సంగతి జగద్విదితం. శంకరులవారున్ను అనేక శాస్త్రగ్రంథాలతో బాటు స్తోత్రగ్రంథాలు గూడా వ్రాసారు. అలాగే శ్రీ రామారావుగారున్ను బహు గ్రంథ రచన చేశారు. ఈ గ్రంథ రచన అంతా 'భుక్తి' కోసం, కీర్తి కోసం కాక 'ముక్తి' కోసం సాగింది. ఇదంతా తన మననం కోసం అని ఆయన స్వయంగా చెప్పిన సంగతి. ఈ 'మననం' కోసం ఆయన రచనలు వింత వింత పుంతలు తొక్కినవి. ఆయన వ్రాసిన అష్టకసాహిత్యంలో "ఆత్మాష్టకం" ఒక వింత. 'ఆత్మాత్వం గిరిజామతిః ' అన్న శ్లోకంలోని భావన ఆయన ఆత్మాష్టకానికి ఆలంబనం. అందులో తనలోనే వ్యాపించిన ప్రత్యగాత్మను స్తుతించారు. స్తుతి అంటే స్వరూప వర్ణన. అంతేగాని ద్వైతంలో కాదు. జ్ఞానమే భక్తి అని అద్వైత దృక్పథము. దానిని మించినది పరమాత్మ సహస్రనామావళి. ఇందులో ఆత్మతత్త్వం గూర్చి స్తోత్రం అనే స్వరూప సంధానం ఉంది. నామరూప రహితుడైన పరమాత్మకు సహస్రనామాలు-నాకు తెలిసినంతలో-ఇవి మాత్రమే. సగుణమూర్తులకు ద్వైతపద్ధతిలో అంటే ప్రభువు-దాసుడు, తండ్రి-పుత్రుడు, తల్లి-పుత్రుడు, రక్షకుడు-ఆర్తుడు" అనే పద్ధతిలో చాలా నామసహస్రాలు ఉన్నవి. కాని "జీవుడే దేవుడు, నేనే దేవుడు" అనే పద్ధతిలో సహస్రనామాలు వ్రాయడం కష్టమే. కాని దానిని చాలా శక్తిమంతంగా యుక్తిమంతంగా సాధించారు శ్రీ రామారావుగారు. ఆ విషయం చూద్దాం.

అద్వైతదర్శనం ప్రకారం సత్యపదార్థం 'బ్రహ్మము'. అదే చేతనం. మిగిలినదంతా మిథ్య. అచేతనం. అంటే ఈ ప్రపంచం ఒక భ్రాంతి. చేతన స్పర్శ వలన అచేతనం. సక్రమంగా మారి ప్రపంచవ్యవహారం, నడుపుతుంది. అదే మాయ. దాని ప్రభావమే వ్యక్తిగత – అవిద్య. ఇది మనలను అంటే చేతనాన్ని అచేతన శరీరంలో నిలిపింది. నిజానికి దేన్ని చూచినా అది బ్రహ్మమే.

కాని మనం దాన్ని ఏదో వస్తువుగా భావిస్తాము. అదే భ్రాంతి అదే మాయ. అదే అవిద్య. ఒక త్రాడును చూచి పాము అనుకొన్నట్లు, దాన్ని పాముగా భావించి, మనం ఊహించినవన్ని ఆ త్రాడుకే చెందుతాయి, కాని వాస్తవంగా చెందవు. అదే విధంగా బ్రహ్మమునందు మనం ప్రపంచ భ్రాంతి పడతాము. అందువలన సత్తారూపమయిన బ్రహ్మము పైన అనేక ఆరోపణలు చేస్తాము. అంటే కుండగా, చెట్టుగా, మనిషిగా దేహంగా భావనలు చేస్తాము. అంటే ఒక్క బ్రహ్మమునే అనేక రూపాలుగా నామాలుగా భావిస్తాం. ఆధారమయిన దానిని మాత్రం మఱచిపోతాం. కనుక బ్రహ్మమునే 'తృణము'గా చివరకు ఈశ్వరునిగా భావిస్తాం. మొత్తం బ్రహ్మంగా మాత్రం భావించలేము. అయితే

వేదాంతదర్శనం ద్వారా మనలోని అవిద్య "మేధాస్థాయి" లో తొలగినపుడు "ఇదంతా బ్రహ్మం అట, నేనుకూడా బ్రహ్మమేనట" అని గ్రహిస్తాం. అనుభవం వస్తే "తానే ఆత్మ అని, ఆత్మకుమించి మిగిలినదంతా భ్రాంతి" అని గ్రహిస్తాం. ఏది ఏమయినా దేహంతో ఉన్నంతవరకు జీవన్ముక్తునకయినా "భావాద్వైతం" తప్ప క్రియాద్వైతం కుదరదు. తప్పు, ప్రమాదం గూడా. దేహంతో ఉన్నంతవరకు వ్యావహారిక సత్యమయిన ప్రపంచంతో వాస్తవ వ్యవహారం తప్పదు. మఱి "భావాద్వైతం" ఎలా సాధ్యం? అందుకే మననం.

మననంలో ముందు సమస్త ప్రపంచాన్ని ఈశ్వరవ్యాప్తంగా భావిస్తాం. తర్వాత ప్రపంచం అంతా ఈశ్వరరూపం అని, ఈశ్వరుడు "బ్రహ్మం" అని భావిస్తాం. "సర్వం బ్రహ్మమయం" అనే భావన బలపడుతుంది. తరువాత బ్రహ్మంయొక్క సచ్చిదానందస్వరూపం గ్రహించటానికి బాహ్యంగా కనపడే ప్రపంచస్వరూపం అచేతన పదార్థాలుగాని, భిన్నంగా మనం భావించే చేతన వ్యక్తులుకాని "బ్రహ్మం" కాదని ఆలోచిస్తాం. ఈవరసలో అచేతనములను నిషేధించగా మిగిలిన 'చేతనం' ఆత్మ అని బ్రహ్మం అని తెలుస్తుంది. తరువాత బ్రహ్మ స్వరూపం 'సచ్చిదానందం' అని చేతన స్వరూపం అని అనుభవానికి వస్తుంది. వీని

"అధ్యారోపం, అపవాదం, స్వరూపం' అని పిలువవచ్చు. వీనిగురించి 71వ శ్లో॥ వద్ద తెలుగు వివరణలో చూడవలసినది.



**అనువాదం :** అజ్ఞానులకు ప్రకాశించనిది కనుక ఆత్మ 'అప్రకాశము'. ప్రాజ్ఞులకు ప్రకాశించును కనుక ఆత్మ ప్రకాశము. సత్త మొ॥ ధర్మములు బ్రహ్మమే. నిత్యభావము అనగా నిత్యత్వము.

**శ్లో॥ నిర్ధర్మత్వం నిర్గుణత్వం నిర్విశేషత్వమేవ చ।**
**పూర్ణత్వమ్పరమాత్మత్వమశబ్దప్రతిపాద్యతా॥ 109**

నిర్ధర్మత్వాదయో బ్రహ్మస్వరూపాదనతిరిక్తా ఏవ.

**అనువాదం :** నిర్ధర్మత్వము అనగా ఏ ధర్మములు లేకపోవుట గూడా బ్రహ్మస్వరూపమే.

**శ్లో॥ ప్రాణప్రాణస్సత్యసత్యం చక్షుశ్చక్షుః శ్రవశ్శ్రవః।**
**ఘ్రాణఘ్రాణం చిత్తచిత్తం బుద్ధిబుద్ధిర్మనోమనః॥ 110**

'ప్రాణో వై సత్యం తేషామేష సత్యం చక్షుషశ్చక్షు' రిత్యాది శ్రుతేరాహ–ప్రాణేతి.

**అనువాదం :** 'ప్రాణము సత్యము'. ప్రాణులకు ఆత్మ సత్యము. కంటికి ఆత్మయే కన్ను అను వేదవాక్యాలను బట్టి భగవంతుడు ప్రాణప్రాణము.

**శ్లో॥ సప్రసాదస్సప్రసాదోఽ ప్యప్రసాదః ప్రసాదనః।**
**యజ్ఞాలభ్యః ప్రజాఽలభ్యో దానాలభ్యస్తథైవ చ॥ 111**

భక్తేషు సప్రసాదః. అభక్తేష్వప్రసాదః. ప్రసాదయతి పరిశోధయతి భక్తానామన్తఃకరణమితి ప్రసాదనః

**అనువాదం :** భక్తులయందు అనుగ్రహం గలవాడు కనుక సప్రసాదుడు. అభక్తులకు అందదు కనుక అప్రసాదుడు. భక్తుల అంతఃకరణమును నిర్మలపఱచును కనుక ప్రసాదనుడు.

**శ్లో॥ శాస్త్రాలభ్యస్తపోఽలభ్యో మేధాఽలభ్యోఽపి లమ్భకః।**
**లభ్యో లబ్ధాప్యలబ్ధశ్చాలబ్ధాలబ్ధశ్చ సర్వదా॥ 112**

'నాయమాత్మా ప్రవచనేవ లభ్యో న మేధయా న బహునా శ్రుతే' నేతి శ్రుతేరాహ–శాస్త్రేతి. లమ్భయతి ప్రాపయతి ఆత్మానమితి లమ్భకః. 'యమేవైష

**అనువాదం :**

**శ్లో॥ నిషేద్ధవ్యనిషేధావశిష్టః సచ్చిత్సుఖాత్మకః।**
**స్వానుభూతిరసావేశతృప్తహంసైకగోచరః॥ 106**

హంసాః పరమహంసాః

**అనువాదం :** హంసలు అనగా అవధూతలయిన పరమహంసలు.

**శ్లో॥ నిత్యకాలో నిత్యసంవిన్నిత్యకం నిత్యఖస్తథా।**
**కఖం ఖకం సత్యఖం చానవకాశో వియత్పరః॥ 107**

నిమేషాదిర్జన్యకాలః ఆయాస్తు నిత్యకాలః. వృత్తిజ్ఞానాన్యనిత్యాని. సంవిదసౌ తు నిత్యా. విషయసుఖమనిత్యమాత్మసుఖం తు నిత్యమితి నిత్యకమ్. జన్యాకాశో౽నిత్యః. అయన్తు నిత్యాకాశ ఇతి నిత్యఖమ్. ప్రాణో బ్రహ్మ కం బ్రహ్మ ఖం 'బ్రహ్మేతి శ్రుతే రాహ-కఖమితి. ఖకమితి. సుఖాభిన్నం గగనం, గగనాభిన్నం సుఖం చాయమేవ. వియతః పరః వియత్పరః.

**అనువాదం :** నిమిషం మొదలయినవి మనం విభజించి పుట్టించిన కాలభేదాలు. కనుక 'జన్యకాలములు'. కాని ఆత్మ 'నిత్యకాలము'. అలానే మనం చేసే మానసిక వ్యాపారాలు అన్నీ అనిత్యములు. 'ఆత్మ' నిత్యజ్ఞానము. విషయాలను అనుభవించడం వలన వచ్చే మన సుఖం అనిత్యం. ఆత్మస్వరూపమయిన సుఖము నిత్యం.

మనం తయారు చేసిన కుండ మొ॥ వస్తువులలోని పరిమిత ఆకాశం అనిత్యం. అలాగే భూతాకాశం గూడా అనిత్యము. ఆత్మ నిత్యాకాశము. కనుక 'నిత్యఖం'. సుఖస్వరూపమయిన ఆకాశం ఆత్మ. ఆకాశస్వరూపమయిన సుఖం ఆత్మ. ఆకాశం కన్న అతీతమయినది కనుక 'వియత్పరం-ఆత్మ'.

**శ్లో॥ అప్రకాశః ప్రకాశశ్చ సత్తాచిత్త్వం చ సత్యతా।**
**చైతన్యం సుఖతా నిత్యభావో బ్రహ్మత్వ మేవ చ॥ 108**

అజ్ఞానామప్రకాశః. ప్రాజ్ఞానాప్రకాశః. నను నిర్ధర్మకత్వమపి సిద్ధం బ్రహ్మణః సత్తాదిధర్మవత్త్వాదత ఆహ-సత్తేత్యాది-నిత్యభావో నిత్యత్వమ్.



ఈ పద్ధతిలోనే రామకవిగారి యీ సహస్రనామావళి నడిచింది.

71వ శ్లోకం వరకు అధ్యారోపంతో నామాలు నడిచినవి. ఈ విషయంలోనే 114వ శ్లోకం వద్ద ఆయన వ్రాసిన మాట స్మరించాలి.

"బ్రహ్మవాచినాం సర్వేషాం బ్రహ్మభిన్న జీవ వాచిత్వాత్"

అలానే అపవాదనామాలు నడిచిన తర్వాత "**నిషేద్ధవ్య నిషేధావశిష్టో హమస్మి**" అని అన్నారు. ఇదే వీటి ప్రయోజనం అని సూచించారు. తరువాత స్వరూప సంధాన పరమయిన నామాలు అయిన తర్వాత సర్వనామసాహస్రికి ముగింపుగా

1) సర్వదేవనమస్సింధు సరిత్పతిః 2) యోహమేవ సః అని తన సహస్రనామ లక్ష్యాన్ని సరసంగా సూచించారు. ఇందులో అధ్యారోపనామాలు 1) ఓ మహమస్మి, నిరంజనోహమస్మి- అని అనుసంధానం చేయదగినవి.

శ్లో॥ 42 నుంచి నామ ప్రపంచారోప నామాలున్నవి.

అపవాదనామాలు 2) స్త్రీ నాహమస్మి, తమో నాహమస్మి-అని అనుసంధానం చేయదగినవి.

ఈ నామ నిర్మాణంలో ఈ విద్వత్కవి తన శాస్త్రసాహిత్య భావనాశక్తులను ఉపయోగించి అనేక విషయాలను పరమాత్మ పరంగా సమన్వయం చేశారు. 1) శ్లేష 2) నామమూలమయిన ధాతువులు మొ॥ వానిని వింగడించి వ్యుత్పత్తి పరంగా అన్వయించటం. 3) అభేద లక్షణ. 4) వేద చోదిత భావాలు. 5) వేదోక్త విశేషణాలు. మొ॥ ఈ నామాలు 3లింగాల్లో ఉన్నాయి. లింగరహితము అయిన పరమాత్మకు అది సూచన.

ఈ విధంగా ఈ పరమాత్మ సహస్రనామాలు ఆత్మానుసంధానానికి చక్కగా ఉపకరించును. ఈ గ్రంథాన్ని తెనిగించమని, వివరించమని నన్ను కోరి యీ సదవకాశం నాకు ఇచ్చిన శ్రీ రావి మోహనరావుగార్కి నా కృతజ్ఞతలు. గ్రంథకర్త అయిన రామ విద్వత్కవికి నా నమస్కారాలు. ఈ చిత్రోదనమును 'చిత్త్రోదనం' గా అనుగ్రహించి అశీర్వదించ గలందులకు ప్రార్థన.

ఇట్లు
**మేళ్ళచెర్వు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రీ**
అనుసంధానకర్త



**ఓం**
**నమో భగవతే హయగ్రీవాయ విష్ణవే**
**మహ్యం మేధాం ప్రజ్ఞాం ప్రయచ్ఛ స్వాహా**
**ఓం**

**శ్రీ బెల్లంకొండ రామరాయకవి**గారి మీద నాకున్న మక్కువను గ్రహించి వారు రచించిన '**శ్రీ పరమాత్మ సహస్రనామావళీస్తోత్రమ్**' తన దగ్గరకు చేరినవెంటనే నాకెరుక పరచుటయే కాక భద్రంగా పంపి సహకరించిన మిత్రులు **డా॥ ఈ.ఏ.శింగరాచార్యుల**గారికి కృతజ్ఞతలు.

ఈ గ్రంథమునకు ఆంధ్రానువాదం చేయవలసినదిగా కోరిన వెంటనే అంగీకరించి అందించినవారు శ్రీ గోరంట్ల వెంకన్న సంస్కృత కళాశాలలో సంస్కృతాధ్యాపకునిగా పనిచేయుచున్న **శ్రీ మేళ్ళచెఱ్వు వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి** గారికి కృతజ్ఞతలు. వీరు శ్రీ బెల్లంకొండవారిని **'చిమనై ప్రణతి సేతు'** నని నుతించిన పద్యము వీరి ఒద్దికను తెలియజేస్తుంది.

చీరాల, సంపాదకుడు
**ది. 26-09-05** **రామోరా**



**శ్లో॥ న వాయుస్థో న లోకస్థో న దేహస్థో నహృత్స్థితః।**
**నమనస్థో నబుద్ధిస్థో నావిద్యాస్థో నసత్త్వగః॥ 101**

అవిద్యాస్థూలాజ్ఞానాని కారణశరీరాణి. సత్త్వం మాయా.

**అనువాదం :** అవిద్యా=స్థూల అజ్ఞానములు. అనగా జీవులయొక్క కారణ శరీరాలు. సత్త్వమ్= మాయ

**శ్లో॥ అనూర్ధ్వోऽనధరోऽమధ్యోऽదక్షిణోऽనుత్తరోऽపి చ।**
**అచ్ఛేద్యోऽయమదాహ్యోऽయమక్లేద్యోऽశోష్య ఏవచ॥ 102**

న విద్యతే ఊర్ధ్వం యస్య స ఉచ్యతే అనూర్ధ్వ ఇతి.

**అనువాదం :** తనకన్న పైన ఎవరూ లేనిది కనుక ఆత్మ 'అనూర్ధ్వము'.

**శ్లో॥ అనాశ్యోऽయమజర్యోయమనుత్పాద్యోయముచ్యతే।**
**అసంస్కార్యోప్యసంస్కర్తాऽసంస్కారశ్చ భవత్యయమ్॥ 103**

జరయితుమశక్యః అజర్యః

**అనువాదం :** జీర్ణం లేదా శిథిలం చేయబడడం సాధ్యం కానిది కనుక ఆత్మ 'అజరము'.

**శ్లో॥ విశ్వపృష్ఠోద్భాసమానః పృష్ఠహీనోऽపురస్థలః।**
**ద్రష్టన్తరవిహీనశ్చ శ్రోత్రన్తరవివర్జితః॥ 104**

విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేష్వితి శ్రుతేరాహ-విశ్వేతి. 'నాన్యోతోస్తి ద్రష్టేతి శ్రుతేరాహ- ద్రష్టితి.

**అనువాదం :** సర్వత్ర అన్ని స్థలములపైన ప్రకాశించువాడు. కనుక ఆ వేదవాక్యం ప్రకారము విశ్వ పృష్ఠోద్భాసమానము ఆత్మ. ఆత్మను మినహాయించి మఱొక ద్రష్ట అయిన చేతన పదార్థము లేదు కనుక ఆత్మ 'ద్రష్టంతర విహీనము'.

**శ్లో॥ మన్త్రన్తరవిహీనశ్చ బోద్ధన్తర వివర్జితః।**
**అసంగోऽనన్తరోऽబాహ్యోऽతుల్యోऽఖణ్డశ్చ చిద్ఘనః॥ 105**

ఆనన్దన్ మైథునం కుర్వన్. విసృజన్ మూత్రపురీషోత్సర్జనం కుర్వన్.

**అనువాదం :** ఆనందన్=దాంపత్యమును అనుభవించుచు, విసృజన్=విసర్జన చేయుచు, అంటే ఈ క్రియలు గూడా ఆత్మకాదు.

**శ్లో॥ న బిభ్యన్న హసన్నాపి జృంభయన్న ధమన్నపి।**
**న తర్జయన్నాపి రుదన్ రోదయన్న చ నాలపన్॥ 95**

**శ్లో॥ నగాయన్ రమయన్నాపి రమమాణో న నో జుషన్।**
**నతూష్ణీం వర్తమానోఽపి నప్రహ్వో నోన్నతోఽపి చ॥ 96**

ప్రహ్వో నమ్రః.

**అనువాదం :** ప్రహ్వః=నమ్రుడు. అంటే వినయంగా తలవంచిన వాడు.

**శ్లో॥ నకాణో నాపి బధిరో నపంగుర్న కుణిస్తథా।**
**నకామీ నాప్యకామీ చ నదుఃఖీ నసుఖీ తథా॥ 97**

పంగుః పాదవికలః కుణిః హస్తవికలః.

**అనువాదం :** పంగుః=కుంటివాడు, కుణిః=అవిటివాడు

**శ్లో॥ నవిద్ధో నాప్యవిద్ధశ్చ నరుగ్ణో న చ నీరుజః।**
**నబ్రహ్మచారీ నగృహీ నవనస్థో న వా యతిః॥ 98**

**శ్లో॥ నసాధకో నసిద్ధశ్చ న వస్త్రీ నదిగమ్బరః।**
**నావధూతశ్చ నమునిర్నతపస్వీ న వా జటీ॥ 99**

మునిర్మననశీలః. మౌనశాలీ వా.

**అనువాదం :** మునిః=మననం చేసే స్వభావం గలవాడు. లేదా మౌనశీలం గలవాడు.

**శ్లో॥ నముణ్డీ నసుకేశశ్చ నాసూత్రో న చ సూత్రవాన్।**
**నభూమిస్థో నవారిస్థో నతేజస్స్థో న ఖస్థితః॥ 100**

సూత్రం యజ్ఞోపవీతమ్.

**అనువాదం :** సూత్రమ్=జందెము.



# పరమాత్మసహస్రనామావళీస్తోత్రమ్

## సంస్కృతమూలమ్ వ్యాఖ్యాచ

## శ్రీ బెల్లంకొండరామరాయవిద్వత్కవిః

### ఆంధ్రానువాదః వివరణంచ శ్రీ మేళ్ళచెఱ్వు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రీ

### ప్రారంభః

**శ్లో॥ ఓన్తత్స-త్పరమాత్మా చ పరతత్వ-మ్పరాయణమ్।**
**ఆత్మా పరాత్మా జీవాత్మా ప్రత్యగాత్మా పరాత్పరః॥ 1**

'ఓ న్తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృత' ఇతి స్మరణాదోన్తత్సదితి నామత్రయమ్. తత్ర చ 'ఏతదాలమ్బనం శ్రేష్ఠమేతదాలమ్బనమ్పర' మితి శ్రుతేరోఙ్కారస్య బ్రహ్మనామత్వాద్బ్రహ్మప్రతీకత్వాద్బ్రహ్మాలమ్బవత్వాచ్చ ప్రథమతో నిర్దేశః. వేదాదావివోఙ్కారస్య ప్రకృతగ్రన్థాదౌ నిర్దేశేన ప్రకృతగ్రన్థస్య చ వేదతుల్యత్వం వేదమూలత్వఞ్చావగమ్యతే.

**అనువాదం :** "ఓం, తత్, సత్" అని బ్రహ్మమునకు 3 సంకేతములున్నవి. కనుక ఆ '3' పేర్లు చెప్పబడినవి. "శ్రేష్ఠం అయిన ఆధారం ఇది. చివఱిదయిన ఆధారం ఇది" అని శ్రుతి ఓంకారమును బ్రహ్మనామంగాను, బ్రహ్మకు ప్రతీకగాను బ్రహ్మకు ఆధారంగాను చెప్పింది కనుక ఈ నామాలలో 'ఓం' ముందు చెప్పాము. అలానే వేదాదియందు ఓంకారమును చెప్పినట్లు ఈ గ్రంథములోను ముందుగా ఓంకారమును చెప్పడం వలన ఈ గ్రంథం వేదతుల్యం అని, వేదమూలం అని ధ్వని.

**వివరణ :** 1) ఓంకారశ్చాథ శబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా,
కంఠం భిత్త్వా వినిర్యాతౌ తతో మాంగళికావుభౌ॥

అను శ్లోకం ప్రకారం ముందుగా బ్రహ్మ కంఠం భేదించికొని వచ్చినది

‘ఓంకారము’. దానికి ‘వేదాది’ అని పేరు. ఇది మాంగలికము. గ్రంథారంభం లో ‘మంగళం’ ప్రతిపాదించినట్లు అయింది. గ్రంథారంభంలో మంగళం గ్రంథనిర్విఘ్న పరిసమాప్తికి దోహదం చేస్తుందని శాస్త్రం. విశ్వాసం.

2) ‘ఓమిత్యేకాక్షరం బ్రహ్మ’ అని శ్రుతి. శబ్దబ్రహ్మమని పేరు. ‘శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధిగచ్ఛతి’ అని సంప్రదాయం.

3) ఓంకారము ‘అ+ఉ+మ్–౼’ అని నాలుగు విభాగాలు. మొదటి ‘3’ విభాగాలు ప్రపంచానికి, లోకాలకు అన్ని రకాల త్రిపుటులకు గుర్తు. వీటికతీతమయి, వీటి సృష్టికి కారణం అయిన మహామాయ అర్ధబిందు స్వరూపం అయిన నాదము. ఈ నాదం ఆగినచోట అనగా ‘నాదాంతం’, బ్రహ్మస్థానం. కనుక ‘ఓం’ ఉపాసన వలన లోకాతీతమయిన బ్రహ్మతత్త్వం వద్దకు నాదమార్గంలో చేరుతాము. కనుక ‘ఓం’కారము బ్రహ్మస్వరూపం.

**శ్లో॥ నారాయణః పరో దేవః పురుషోత్తమ ఈశ్వరః।**
**పురాణపురుషో నిత్యో నిరవద్యో నిరఞ్జనః॥** **2**

అవద్యో దోషః అఞ్జనం లేప ఇతి వివేకః

**అనువాదం :** అవద్యః అనగా దోషం అని అర్థం. అఞ్జనం అనగా ‘పూత’ అని అర్థం.

**వివరణ :** పరమాత్మ అఖండతత్త్వము. దానియందు మనముగాని మాయగాని కల్పించిన ఈ మిథ్యాప్రపంచం అసలు అంటదు. సినిమా తెఅపై ఎన్ని దృశ్యములాడినను అవి తెఅకు అంటవు. ఎటువంటి దోషములు భేదములు అంటనివాడు. శుద్ధతత్త్వం.

**శ్లో॥ అవ్యక్తోऽక్షర ఆద్యశ్చ శుద్ధో బుద్ధశ్చ నిర్మలః।**
**సర్వజ్ఞస్సర్వవిత్సత్యం జ్ఞానమవ్యయ ఆశ్రయః॥** **3**

సామాన్యాకారేణ సర్వజ్ఞః విశేషాకారేణ సర్వవిత్.

**అనువాదం :** సామాన్యంగా సర్వజ్ఞుడని నామము. విశేషంగా సర్వవిత్ అని నామము.



**అనువాదం :** నిర్దిశః=దేశములేనివాడు.

**శ్లో॥ ననిషేధ్యో నిషేద్ధా నో నబలం నయశో నభీః।**
**నసంకల్పో నకామశ్చ నశ్రద్ధా నధృతిస్తథా॥** **89**

భీసంకల్పాదీనామ్మనోధర్మత్వాన్నాత్మత్వమ్.

**అనువాదం :** భయము సంకల్పము మొ॥ ఆత్మధర్మములు కావు. మనో ధర్మములు. కనుక అవి ఆత్మకావు.

**శ్లో॥ నసంశయో నిశ్చయో నో నహ్రీర్గర్వో న న స్మృతిః।**
**నరోగో నాపి చారోగ్యం నశీతం నోష్ణముచ్యతే॥** **90**

హ్రీర్లజ్జా. శీతం శీతస్పర్శః.

**అనువాదం :** హ్రీ=సిగ్గు. శీతమ్=చల్లని స్పర్శ.

**శ్లో॥ నానుష్ణోశీతమప్యేష నరసో న చ గన్ధకః।**
**ననామ నాకృతి ర్నాపి శబ్దో నేదన్న తన్న యత్॥** **91**

గన్ధో ఘ్రాణగ్రాహ్యోగుణః. శబ్దో ధ్వనిః.

**అనువాదం :** గంధము =వాసన. శబ్దము=చప్పుడు.

**శ్లో॥ నాదో న కిం న శుక్లం చ న కృష్ణం చ న లోహితమ్।**
**న మూర్తం నాప్యమూర్తం చ న సన్న త్యన్న తత్పరమ్॥** **92**

సత్పృథివ్యాదిభూతత్రయం. త్యద్వాయ్వాకాశద్వయమ్.

**అనువాదం :** సత్=భూమి మొ॥ 3 భూతములు. నేల, నీరు, నిప్పు. త్యత్=గాలి, ఆకాశము అను భూతద్వయము.

**శ్లో॥ నప్రస్థితో నస్థితశ్చ ననిషణ్ణశ్చ నస్వపన్।**
**నశయానో నపశ్యంశ్చ నశృణ్వానశ్చ నోమనన్॥** **93**

మనన్ మననం కుర్వన్.

**అనువాదం :** మనన్=మననము చేయుచు.

**శ్లో॥ రసయన్నో నజిఘ్రంశ్చ నగృహ్ణన్నోవదం స్తథా।**
**నోన్మిషన్నాపి నిమిషన్నానన్దన్విసృజన్నపి॥** **94**

**అనువాదం :** ప్రమాకరణమ్=అనగా ప్రమాణము. ప్రమితిః=ప్రమాణంగా తెలిసికొనుట.

**శ్లో॥ నలవో నత్రుటిర్నాపి నిమేషో నముహూర్తకః।**
**నదినం ననిశా నాపి దినరాత్రం తిథిర్న చ॥ 84**

లవాదయః కాలవిశేషాః. దినరాత్ర్యోస్సమాహారః దినరాత్రమ్.

**అనువాదం :** లవః=కాలంలోని త్రుటి, కాష్ఠ, క్షణం మొ॥ భేదాలలో ఒకటి. దినరాత్రమ్=రేయింబవళ్ళు.

**శ్లో॥ నపక్షో నాపి మాసశ్చ నఋతుర్నాపి చాయనమ్।**
**నవత్సరో న చ యుగో యుగసన్ధి స్తథా న చ॥ 85**

యుగయోర్మధ్యకాలో యుగసన్ధిః

**అనువాదం :** యుగముల మధ్యకాలము యుగసంధి.

**శ్లో॥ నకల్పో నమహాకల్పో నిత్యకల్పోఽపి నో తథా।**
**నాత్యన్తికోఽపి కల్పశ్చ నవిసర్గో నసర్గకః॥ 86**

కల్పోనైమిత్తికః ప్రళయః. నిత్యకల్పస్సుషుప్తిః ఆత్యన్తికకల్పః ముక్తిః.

**అనువాదం :** కల్పః =నైమిత్తిక ప్రళయము. నిత్యకల్పః=రోజూపోయే గాఢనిద్ర=సుషుప్తి. ఆత్యంతికః కల్పః=శాశ్వత ముక్తి.

**శ్లో॥ నాతిసర్గో నరక్షా చ నావతారో న వా విరాట్।**
**న సూత్రాత్మాఽవ్యాకృతో న నప్రాజ్ఞో న చ తైజసః॥ 87**

సూత్రాత్మా హిరణ్యగర్భః. అవ్యాకృతః కారణోపాధిరీశ్వరః.

**అనువాదం :** సూత్రాత్మ=అనగా సర్వజీవాంతర్యామి అయిన హిరణ్యగర్భుడు ఈశ్వరుడు, అవ్యాకృతః=సర్వజీవకారణ శరీరగతుడయిన ఈశ్వరుడు.

**శ్లో॥ నవిశ్వో నతురీయశ్చ నభోగ్యమ్భోగ ఏవ చ।**
**నసర్వం చ ననిర్దేశ్యో ననిర్దేష్టా ననిర్దిశిః॥ 88**

నిర్దిశిః నిర్దేశః.



**వివరణ :** సర్వజ్ఞుడన్నా, సర్వవిత్ అన్నా అర్థంలో తేడా ఏమీలేదు. సర్వం తెలిసినవాడని అర్థం. అందువలన '2' నామములు పునరుక్తి అవుతాయి. అందువలన అర్థభేదం చూపుతున్నారు. తెలియడం 2 రకాలు.

1) మామూలుగా తెలియడం–పరిచయం. 2) పూర్తిగా తెలియడం – జ్ఞానం.

ఈ '2' రకాల జ్ఞానాలు భగవంతునికి ఉన్నాయని అర్థం.

**శ్లో॥ అనన్దః పురుషః పూర్ణ ఏకోఽ ద్వైతోఽచలోఽచ్యుతః।**
**స్థాణుస్సర్వగతో విష్ణు–స్సర్వాత్మా చ సనాతనః 4**

అచలశ్చలరహితః. స్థాణుఃస్తబ్ధః 'వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠ' తీతి శ్రుతేః . సామాన్యవిశేషభావాన్న పునరుక్తిః. అర్థైక్యేపి శబ్దస్వరూపభేదేన పర్యాయ పదానా మివ న దోష ఇతి వా. సర్వస్యాత్మా స్వరూపం సర్వాత్మా.

**అనువాదం :** అచలః అంటే చలనం లేనివాడు. స్థాణుః అంటే స్తబ్ధంగా మొద్దులాగా ఉండేవాడు. ద్యులోకంలో 'వృక్షం' లాగా స్తబ్ధంగా వుండేవాడు అని వేదం. సామాన్యంగా 'చలనం' లేనివాడని, విశేషంగానూ చలనం లేని వాడని అర్థం. అందువలన పై '2' నామాలకు పునరుక్తి దోషం లేదు. లేదా అర్థం ఒక్కటే అన్నా "పర్యాయపదంగా ఇచ్చినట్లు భావింపవచ్చును. సమస్తమునకు నిజమయిన రూపం అయినవాడు.

**వివరణ :** 'అచలః' అన్నా, 'స్తబ్ధః' అన్నా కదలిక లేనివాడనే అర్థం. '2' నామాలు ఎందుకు?

1) సామాన్యంగా ఎక్కడికీ కదలడు అంటే ఎప్పుడయినా కదలవచ్చును అని అర్థం రావచ్చును. 'ఆయన ఎక్కడికీ పోడు అంటాం' ఎవర్ని గురించి అయినా. అంటే ఆయన పిడుగు మీద పడ్తున్నా కదలడని అర్థం. 'అచలః' అంటే అది అర్థం. 'స్తబ్ధః' మళ్ళా చెప్పడం చేత పిడుగులు మీద పడ్డా కదలడని అన్నట్లు 'అసలు కదలడు, విశేషంగా ఎప్పుడయినా కదలడు' అని అర్థం వస్తుంది. (కనుక 2 నామాలు దండగ కాదు.)

2) అసలు ఈ 'కదలిక' విషయం ఏమిటి? 'ఆత్మ, పరమాత్మ, బ్రహ్మ' అంతా ఏకవస్తువు గురించి చెప్పిన మాటలు.

**'సర్వం ఖల్విదం బ్రహ్మ'** అని శ్రుతి. సర్వవ్యాపిగా వున్న బ్రహ్మ ఎక్కడికి పోతాడు. 'ఆకాశం' ఎక్కడికి పోతుంది? మనం లేనిచోటికి మనం వెళ్లాలి. మనం అంతటా ఉంటే వెళ్లేది ఎక్కడికి? కనుక 'ఆత్మ' కదలదు అని అర్థం.

3) మఱి అలాంటప్పుడు 'అచలః' అన్నదే సరిపోతుంది గదా. ఇతర ఖండ వస్తువుల గురించి ఆలోచించినట్లు 'విశేషంగా కదలదు' అని ఎందుకు చెప్పడం అని ప్రశ్న. అందువలన "పర్యాయపదం"గా భావించమని ఇంకొక సమన్వయం చెప్పబడింది. ఒక విషయాన్ని 2 సార్లు చెప్పితే మఱింత దృఢంగా ఆ గుణం చెప్పినట్లు గదా!

**శ్లో॥ ఆకాశ ఇన్ద్రః ప్రాణశ్చ మహాన్బ్రహ్మ బృహద్ద్రవః।**
**అనన్తోఽపార ఈశానో మహాదేవో మహేశ్వరః॥** **5**

ఆ సమన్తాత్కాశతే ప్రకాశత ఇత్యాకాశః. ఇన్ద్రః పరమైశ్వర్యశాలీ. ప్రాణితి జగదనేనేతి ప్రాణః.అనన్తో వస్తుతోఽన్తరహితః. అపారో దేశతఃపారరహితః.

**అనువాదం :** అంతటా వ్యాపించి ప్రకాశించేది కనుక ఆకాశము. సర్వాతీత మయిన ఈశ్వరత్వం ఉన్నది కనుక ఇంద్రుడు. ఈ ఆత్మవలననే ఈ మిథ్యా జగత్తు అస్తిత్వంలో బ్రతుకుతున్నది కనుక ప్రాణము. ఆత్మనిత్యసత్యం కనుక అంతం లేనిది. సర్వవ్యాప్తం అయినందువలన ఆద్యంతములు లేనిది.

**వివరణ :** 'ఖం బ్రహ్మ' అంటారు. దీనిని 'సున్న' తో పోలుస్తారు. 'సున్న' ఆకాశం వంటిది. దానికి మొదలు చివఱ లేవు. అందులో పోయేది, ఉండేది లేదు. పూర్ణం అదే. శూన్యం అదే. ఏది పోయినా అది ఉంటుంది. ఏ అంకెకయినా ఆధారం అదే. దానిమీదనే '1' మొ॥ అంకెలు సృష్టింపబడతాయి.
**'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' 'అనాద్యనంతం మహతః పరం తత్॥**

పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥
అంతః పూర్ణః బహిః పూర్ణః పూర్ణకుంభ ఇవాంబరే,
అంతశ్శూన్యః బహిశ్శూన్యః శూన్యకుంభ ఇవాంబరే- అన్నట్లు

బ్రహ్మం అనాది, అనంతం, అఖండం, ఆకాశం, అపారం, సర్వప్రాణం, సర్వేశ్వరం. అదే ఆత్మ, పరమాత్మ.



**అనువాదం :** ముఖజః=బ్రాహ్మణుడు ఆత్మ కాదు.

**శ్లో॥ నమధ్యమో నోత్తమశ్చ న చణ్డాలో న పుల్కసః।**
**నభూమిజో నామ్బరజో నామ్బుజో న చ వాయుజః॥** **79**

పుల్కసో జాతివిశేషః.

**అనువాదం :** పుల్కసః=ఒక జాతివాడు. అతడున్ను ఆత్మకాదు.

**శ్లో॥ నాయోనిజో యోనిజోన నజాతో జనకశ్చ న।**
**నమిత్రం న చ శత్రుశ్చ నోదాసీనో నమధ్యగః॥** **80**

అయోనిజస్సీతాదిః. మధ్యగః మధ్యస్థః

**అనువాదం :** అయోనిజః=సీత, మొ॥వారు ఆత్మలు కారు. మధ్యగః =మధ్యస్థుడు, మధ్యవర్తి ఆత్మకాదు.

**శ్లో॥ నాజితో నజితశ్చాపి నశ్రోతా న చ వాచకః।**
**నవాక్యం నాపి వాక్యార్థో నలక్ష్యార్థో నభాషణమ్॥** **81**

వాచకో వక్తా. వాక్యం శబ్దసముదాయః. భాషణం వచనముచ్చారణమితి యావత్.

**అనువాదం :** వాచకః=వక్త. వాక్యం=శబ్ద సమూహము. భాషణమ్=అనగా మాట్లాడుట. పదములను ఉచ్చరించుట. ఇవి ఏమియును ఆత్మ కాదు.

**శ్లో॥ శ్రవణం మననం నో నో నధ్యానం ననిదర్శనమ్।**
**నోపమానం నానుమానం నప్రత్యక్షం నలిఙ్గకమ్॥** **82**

నిదర్శనం నిదిధ్యాసనమ్. లిఙ్గం ధూమాదిసాధనమ్.

**అనువాదం :** నిదర్శనమ్=ధ్యానము చేయుట. లింగమ్=ముఖ్యమయిన చిహ్నము. 'నిప్పుకు-పొగ' ఇట్టివి-ఇవియును ఆత్మకాదు.

**శ్లో॥ నప్రమాణం నప్రమేయం నప్రమాతా న చ ప్రమా।**
**నాదిర్నాన్తో నమధ్యశ్చ నజీవో నేశ్వరోఽపి చ॥** **83**

ప్రమాకరణం ప్రమాణమ్. ప్రమితిః ప్రమా.

**వివరణ :** 'ఆత్మ' తప్ప మిగిలిన ఏ రకం అయిన వస్తువులు గాని, వాటి సంబంధించిన భావనలు కాని, ఆత్మ కావు. కనుక ఘటము ఆత్మకాదు. దాని అభావము గూడా ఆత్మకాదు అని చెప్పారు.

**శ్లో॥ నకర్మ చ నసామాన్యం నవిశేషో భవేన్నచ।**
**సమవాయో నసంయోగో నకార్యం న చ కారణమ్॥ 75**

సామాన్యం జాతిః

**అనువాదం :** సామాన్యం అనగా జాతి. ఇదియు ఆత్మకాదు.

**వివరణము :** 'జాతి' అంటే కొన్ని సమానాకార వస్తువుల యందు సమానంగా ఉండే లక్షణాన్ని జాతి అంటారు. దాని ఆకారాన్ని బట్టి గ్రహిస్తాము. ఉదా : కుండ ఒక వస్తువు. కాని కొన్ని వందల కుండలయందు గల సాదృశ్యం –కుండజాతి. దాన్ని బట్టే ఏ కుండనయినా పోల్చుకోగలం. ఘటత్వం= కుండత్వం–అదేజాతి. మానవుడు ఒక వ్యక్తి. కొన్ని వందల మానవులయందు కుల,మత,దేశభేదాలకు అతీతంగా గ్రహించే ఆకారసామ్యం 'జాతి'. అదే మనుష్యజాతి. మనుష్యత్వం. ఈ జాతి ఒక పదార్థము. ఇది గూడా ఆత్మకాదు.

**శ్లో॥ నోపాదానం నిమిత్తంనకారకం కరణం న న**
**న నిషేధో నచాదానం నౌదాసీన్యం నశాసనమ్. 76**

కారకం ప్రయోజకర్తృ. కరణం సాధకతమమ్.

**అనువాదం :** కారకమ్=ప్రయోజకకర్త. ఒక పనికి ఒక వ్యక్తిని నియమించే వాడు. కరణం=అసాధారణమయిన కారణము కరణము. కుండ చేయుటకు కావలసిన దండము మొ॥. ఇవి ఆత్మకాదు.

**శ్లో॥ నశాస్త్రం నగురుర్నాపి శిష్యో నేశో న చ ప్రజా।**
**నపితా న చ పుత్రశ్చ నమాతా నాగ్రజో పి చ॥ 77**

ఈశో రాజా. ప్రజా తత్పాల్యజనః.

**అనువాదం :** ఈశః=రాజు–ఆత్మకాదు. ప్రజా=ప్రజలు–వీరు 'ఆత్మ' కాదు.

**శ్లో॥ నానుజో నాన్త్యజో నాపి మధ్యజో ముఖజశ్చ న।**
**నబాహుజో నోరుజాతః పాదజశ్చ న నాధమః॥ 78**

ముఖజో బ్రాహ్మణః.



**శ్లో॥ సర్వాన్తరస్సూక్ష్మతమో జ్ఞేయో జ్ఞాతా నిరాశ్రయః।**
**విభుర్విశ్వో విరాట్తేజ స్స్వప్రభ స్స్వస్థ ఆత్మవిత్॥ 6**

జ్ఞేయః 'ఆత్మావాఽరే ద్రష్టవ్య' ఇతి 'తమేవైకం జానథ ఆత్మాన' మితి చ శ్రుతేః. స్వస్థః స్వే మహిమ్ని వ్యవస్థిత ఇతి శ్రుతేః.

**అనువాదం :** జ్ఞేయః అంటే తెలియదగినవాడు. "ఆత్మద్రష్టవ్యం" అని, 'ఆ ఏకవస్తువయిన ఆత్మను అర్థం చేసికొనండి' అని శ్రుతి చెప్తున్నది. స్వస్థః –భగవంతుడు తనయందు తానున్నాడు. తన మహిమలోనే తానున్నాడని శ్రుతి చెప్తున్నది.

**వివరణ :** ఆత్మ సర్వాంతరుడు. అందఱియందు అనగా అన్ని దేహములందు 'జీవరూపంగా' ఉన్నాడు. కనుకనే అత్యంత సూక్ష్మం అని చెప్పవచ్చును. అట్టివాడు 'జ్ఞానం'తో తెలియదగినవాడు. సర్వులకు ఈవిధంగా ఆయన ఆధారం. ఆయనకు ఆధారం ఎవరు అంటే ఆయనకు ఆయనే ఆధారం. శ్రుతిలో గూడా ఈ ప్రశ్న వచ్చింది.

'స భగవః కస్మిన్ ప్రతిష్ఠితః'

అయ్యా, పరమాత్మకు, ఆయతనం ఏది? అని.

'స్వే మహిమ్ని ప్రతిష్ఠితః'

ఆయనకు ఆయతనం ఆయనే. సర్వానికి ఆయతనం ఆయనయే. 'మహిమ' అంటే ఏమి? గొప్పతనం. ప్రపంచవ్యాప్తి ప్రపంచాధారత ఆయనవి. మళ్ళా అందులోను బయట ఆయన నిండి వున్నాడు.

**శ్లో॥ ప్రాజ్ఞశ్చ తైజస స్సర్వం తత్త్వఞ్చ త్వ మహం శివః।**
**సత్యసన్ధస్సత్యకామస్సర్వగన్ధో మనోమయః॥ 7**

తత్త్వమితి 'తత్త్వన్నారాయణః పర' ఇతి శ్రుతేః. 'తత్త్వమసి, అహం బ్రహ్మాస్మీ' తి శ్రుతిభ్యాం త్వం శబ్దస్యాహం శబ్దస్య చ పరమాత్మైవ లక్ష్యార్థ ఇతి కృత్వా త్వమహమిత్యుక్తమ్.

**అనువాదం :** తత్త్వం–అంటే సర్వప్రపంచవ్యాప్తం అయిన సారం. అదీ ఆత్మయే.

'నారాయణుడే పరతత్త్వం' అని శ్రుతి. 'త్వమహమ్' అని మఱొకనామ ద్వయము. 'నీవే ఆ పరబ్రహ్మానివి' అని శ్రుతి. అందువలన ఆత్మకు 'త్వం' అని ఒక పేరు. 'నేనే బ్రహ్మను' అని ఒక శ్రుతి. అందువలన 'అహం' ఒకపేరు. ఈ '2' శబ్దాలకు లక్ష్యార్థము బ్రహ్మమే.

**వివరణ :** 'తత్త్వం త్వం, అహం' 3 పదాలు చెప్పబడినవి. 'తత్, త్వం, అహం' అని చెప్పినట్లు. అంటే 'నీవు, నేను, వాడు' గూడా బ్రహ్మమే కాని '3' పదాల వలన వ్యక్తి భేదం వచ్చింది. గుణభేదం వచ్చింది. 'ఒకటి' కావటం ఎలా? అంటే 'లక్షణం'తో అంటున్నారు. 5 ఏండ్ల వయసులో చూసిన వ్యక్తి 20 ఏండ్ల వయసులో మఱల చూస్తాం. ఈ మధ్య 15 ఏండ్లలో వానిలో చాలా మార్పులు వస్తాయి. అయినా ఆ మార్పులు పోను సామాన్య రూపరేఖా సామ్యాన్ని బట్టి 'వాడే వీడు' అని గుర్తిస్తాము. అలానే నీవు, నేను లాంటి భేదాలతో తేడా చూపినప్పటికి సమాన లక్షణాలతో వారిద్దరు ఒకే 'ఆత్మతత్వం' అని గుర్తిస్తాము. ఇలా గుర్తించటమే లక్షణ. సత్యత్వము జ్ఞానత్వము, ఆనందత్వము అనేవి సర్వాత్మలకు సమానలక్షణాలు. దీనిని బట్టి భిన్నత్వం లేదు ఒకటే. కేవలం శరీరం వలన భిన్నత్వం కనబడుతున్నది. కుండలో ప్రతిబింబించిన ఆకాశం, బానలో ప్రతిబింబించిన ఆకాశం, గుహలో ప్రతిబింబించిన ఆకాశం, ఇంట్లో ప్రతిబింబించిన ఆకాశం, ఒంట్లో ప్రతిబింబించిన ఆకాశం– ఆయా ఆధారాలను బట్టి భిన్నంగా కనబడినా– ఆకాశమే కదా!

**శ్లో॥ భూతాత్మా భూతభృద్భూతనాథో భూతస్థితోఽనఘః।**
**భూతకృద్భూతజి ద్భూతప్రాప్యో భూతవివర్ధనః॥ 8**

భూతానామాత్మా భూతాత్మా.

**అనువాదం :** భూతములకు ఆత్మ కనుక భూతాత్మ.

**శ్లో॥ అజోఽజిరోఽమృతోఽద్వన్ద్వోఽభయోఽగ్రాహ్యోఽమతోఽమనాః।**
**అప్రాణోఽతనురస్థూలోఽహ్రస్వోఽదీర్ఘోఽణుశ్చితిః 9**

ద్వన్ద్వం శీతోష్ణాది. చితిశ్చైతన్యమ్. అగ్రాహ్యో న హి గృహ్యతే. 'అప్రాణో హ్యమనాశ్శుభ్ర' ఇత్యాదిశ్రుతయ ఇహోదాహార్యాః.



షండుడు కాదు, పురుషుడు కాదు' మొ॥ నామాలు వస్తాయి. అంటే ఈ పైన కనబడే 'నామరూపాలు' వానివలన వచ్చిన భేదాలు బ్రహ్మం కావు అని చెప్పటం తద్ద్వారా వాటికి భిన్నం అయి ఆధారంగా ఉన్న 'ఆత్మ' తత్త్వాన్ని అవగతం చేయటం ఈ నామాల ప్రయోజనం.

**శ్లో॥ నస్వేదజో నాణ్డజో వా నోద్భిజ్జో నజరాయుజః।**
**నదేహో నేన్ద్రియం నాసు–ర్నమనో నమతి ర్నకమ్॥ 72**

ఉద్భిజ్జస్తరుగుల్మాదిః అసుఃప్రాణః. కం విషయసుఖమ్.

**అనువాదం :** ఉద్భిజ్జః=నేలనుంచి పొడుచుకొని వచ్చే మొక్కలు, పొదలు, తీగలు మొ॥ ఇవి పరమాత్మ కాదు. అసువు=ప్రాణము. ఇది ఆత్మ కాదు. కం=విషయసుఖము అంటే విషయాలను అనుభవించడం వలన వచ్చే సుఖము.

**శ్లో॥ నదుఃఖం నతమో నార్చి ర్నాజ్ఞానం నధరా సుఖమ్।**
**నాగ్ని ర్నతోయం నమరు న్నచరం నాచరన్తథా॥ 73**

తమోఽన్ధకారః చరం జంగమమచరం స్థావరమ్.

**అనువాదం :** తమః=చీకటి–ఆత్మకాదు, చరమ్=కదలే ప్రాణులు, అచరమ్=కదలని ప్రాణులు.

**శ్లో॥ నచేతనం నాచేతనం నశూన్యం నమృషా తథా।**
**నభావో నాప్యభావశ్చ నద్రవ్యం నగుణోపి చ॥ 74**

చేతనం పశ్వాది. అచేతనం పాషాణాది. శూన్యం గగనారవిన్దాది. అత్యన్తం సర్వస్యాభావో వా. మృషా రజ్జుసర్పాదిః. భావో ఘటాదిః. అభావో ఘటాభావాదిః.

**అనువాదం :** చేతనమ్=పశువులు మొ॥ అయినవి. అచేతనమ్=రాళ్లు మొ॥ అయినవి. శూన్యమ్=ఆకాశం, ఆకాశపుష్పము మొ॥ లేదా పూర్తిగా లేకపోవడం గూడా ఆత్మకాదు. మృషా=మిథ్య అయిన అనగా భ్రాంతి వలన ఏర్పడిన (రజ్జు) సర్పాదులు. భావః=కుండ మొ॥ వస్తువులు. అభావః=వస్తువుల లేమి. ఇవేవియును ఆత్మ కావు.

సన్ అనగా పుట్టి అస్తిత్వం పొందిన పదార్థము. అంతే తప్ప సత్యంగా ఉన్న పదార్థం కాదు. 'వి' అనగా పక్షి.

**విశేషము :** 'అధ్యారోపము అపవాదము' అని 2 పద్ధతులతో బ్రహ్మ స్వరూపజ్ఞానం సంపాదించవచ్చును.

అధ్యారోపం అంటే లేనివి నెత్తిన పడవేయటం. అంటే ఆరోపించటం. అపవాదం అంటే ఉన్నదనుకొంటున్న దానిని కాదనటం.

సూక్ష్మంగా చెప్పాలంటే (1) ఆరోపించటం (2) కాదనటం.

ప్రస్తుత విషయంలో వీనికి సమన్వయం ఏమిటంటే–

ఉన్నది 'బ్రహ్మం'. అదే సత్యం. మిగిలిన 'దృశ్య అదృశ్య సృష్టి వస్తు సమూహం' అంతా మాయ. మిథ్య. ఉన్నట్టు కనబడే భ్రాంతి. ప్రసిద్ధమయిన ఉదాహరణ 'రజ్జుసర్పభ్రాంతి'.

సత్యవస్తువు రజ్జువు (త్రాడు). చీకటిలో దానిని చూసి 'పాము' అనుకొంటాం. ఇది అధ్యారోపం. అంటే రజ్జువు నందు 'పాము' అనే ఆరోపణ చేశాం. అలానే ఉన్నది 'బ్రహ్మం'. కాని అవిద్యలో ఉన్న మనం దానిని 'ప్రపంచం'గా భావించాము. ఇది అధ్యారోపం. అందువలన ఈ నామాలలో ప్రపంచంలో ఉన్న అన్ని పదార్థాలను బ్రహ్మంగా లేదా పదార్థాలను 'బ్రహ్మం'గా భావించిన తీరు కనబడింది. ఇక అపవాదం. అంటే నిషేధం.

దీపం వచ్చింది. ఆ వెలుతురులో అసలు విషయం కనబడింది. 'పాము కాదు, త్రాడు' అని తెలిసింది. అలానే జ్ఞానసాధనం అయిన 'వేదాంతం' వచ్చింది. దానివలన కలిగిన జ్ఞానంలో చూస్తే 'సర్వం బ్రహ్మ' అని తెలిసింది. ప్రపంచం మన భ్రాంతి అని తెలిసింది. కనుక ఇంతకుముందు వేటిని బ్రహ్మపై ఆరోపించి చూచామో ఆ వాటిని బ్రహ్మ కాదని చెప్పటం జరుగుతుంది. ఇది అపవాదము. కనుక ఇక్కడనుంచి ఇంచుమించు చివరిదాకా అపవాదపరంగా 'అది బ్రహ్మం కాదు, ఇది బ్రహ్మం కాదు. ఇదికాక మిగిలినదే బ్రహ్మం' అను 'ఎలిమినేషన్ థియరీ' పద్ధతిలో నామాలు వస్తాయి. అందువలననే స్త్రీ కాదు,



**అనువాదం :** ద్వంద్వం అంటే శీతోష్ణములు మొ॥ సుఖదుఃఖములు, వాటిని కలిగించే పదార్థయుగ్మాలు ద్వంద్వాలు. 'చితి' అంటే చైతన్యము. అనగా 'జ్ఞాన పదార్థము'. అగ్రాహ్యం అంటే గ్రహింపశక్యము కానిది.

'ప్రాణము లేనిది. మనస్సు లేనిది, దోషరహితమయినది' మొ॥ శ్రుతులు ఈ నామాలకు మూలముగా పేర్కొనదగినవి.

**వివరణ :** 'జ్ఞానం' ఒక్కటే సత్పదార్థము. అదే ఆత్మ. అదే జీవుడు. మిగిలిన ప్రపంచమంతా అజ్ఞానము. అంటే మిథ్య. అనగా భ్రాంతి. దీనికి 'రజ్జు సర్పన్యాయము' ఉదాహరణం.

ఉన్నది త్రాడు. కాని మనం చీకటి వలన భ్రాంతి పడ్డాం. అందువలన 'త్రాడు' పాములాగా కనబడింది. తరువాత మెలికలు తిరుగుతుంది. మీద కాలు వేస్తే–లేదా వేసినట్టు భయస్థునికి అనిపిస్తే– కఱుస్తుంది. ఈ పాము కఱవటం వలన వాడికి విషం ఎక్కుతుంది. మూర్ఛ వస్తుంది. మఱీ భయస్థుడయితే మరణం కూడా వస్తుంది. తరువాత దీపం తెచ్చి చూస్తే అది 'పామే' కాదని తెలుస్తుంది. 'త్రాడు' అని తెలుస్తుంది. మఱి మెలికలు తిరగటాలు, కఱవటాలు, మూర్ఛలు మరణాలు మొ॥ దృశ్యాలు ఎలా వచ్చినవి? విషమే లేదు, పామే లేదు ఈ విషదృశ్యాలు ఎలా? ఎలా అంటే 'మనస్సులోనికి ఎక్కిన భ్రాంతి, భయం' అనే విషాలు. వాటి ఫలితాలు ఇవి.

అలానే చీకటి వంటిది అవిద్య. దానివలన వచ్చిన లౌకిక జ్ఞానం భ్రాంతి. దానివలన 'బ్రహ్మం, ప్రపంచంలా కనబడుతుంది. నీవు నేను వాడులా కనబడుతుంది. దానివలన రకరకాల విషఫలితాలు చివఱకు మరణాలు పునర్జన్మలు వస్తాయి. ఇంతలో ఆచార్యశంకరులో, మన బెల్లంకొండరామ పండితుడో ఒక జ్ఞానదీపం తెచ్చి చూపిస్తారు. మన కండ్లు సరిగా ఉంటే ఇదంతా 'బ్రహ్మం' అని తెలుస్తుంది. అప్పుడు భేదాలు లేవు. వాటి విషాలు లేవు. కనుక 'ఆత్మ' ఒక్కటే అని తెలిసిన తర్వాత భేద రూపమయిన 'ద్వంద్వాలు' లేవు. సుఖ దుఃఖాలు లేవు. అవి లేకపోయిన తర్వాత వాటిమూలంగా గుర్తింపపబడే "శీతోష్ణాదులు" లేవు. కనుక 'ఆత్మ' ద్వంద్వరహితుడు.

**శ్లో॥ దృక్సాక్షీ కేవలోఽ శబ్దోఽ స్పర్శోఽ రూపోఽ రసోఽ గుణః।**
**శేషీ శేషోఽ ప్యశేషశ్చ నిర్విశేషో విశేషవిత్॥ 10**

'అశబ్దమస్పర్శమరూపమవ్యయం తథాఽ రసం నిత్యమగన్ధవచ్చయ' దితి శ్రుతే రశబ్ద ఇత్యాదికముక్తమ్. 'సాక్షీ చేతా కేవలో నిర్గుణ' శ్చేతి శ్రుతేస్సాక్షీ కేవల ఇతి. శేష స్సర్వనాశే సత్యవశిష్టః విశేషాన్నిత్యద్రవ్యవృత్తిధర్మాన్వేత్తీతి విశేషవిత్.

**అనువాదం :** "శబ్ద స్పర్శరూపరసగంధ, నాశములు మొ॥ ఆత్మకు లేవని శ్రుతి చెప్పినది. ఆత్మ సర్వసాక్షి అని, ఏకమని, నిర్గుణమని, గూడా శ్రుతి చెప్పింది. సర్వప్రపంచం ప్రళయం అయినా సాక్షిగా నిలిచి ఉండేది ఆత్మ. నిత్యద్రవ్య సంబంధమయిన గుణగణాలను గుర్తించగలది కనుక 'విశేషవిత్' అని 'ఆత్మ'కు నామము.

**వివరణ :** ఉన్నది బ్రహ్మం ఒక్కటే. అదే ఆత్మ అదే పరమాత్మ. దానికి ఏ గుణాలు లేవు. దాని స్వరూపమే సత్యజ్ఞానానందం. శబ్దము మొ॥ మాయాజన్యమయిన ఆకాశాది గుణములు. అవి ఆత్మవి కావు. ఉదా॥

ఎఱ్ఱ కుండలో నీళ్ళున్నాయి. ఇందులో 'మట్టి' తత్త్వ పదార్థము. అది బ్రహ్మం వంటిది. ఎఱ్ఱదనము, కుండ అనే పేరు, ఆ రకంగా ఉండే ఆకారము. కుమ్మరివాని శిల్పం– అదే మాయ వలన మట్టి పై ఏర్పడినవి. ఈ ఆకారం వలన దానికి నీళ్ళు నిలువచేసే సామర్థ్యం వచ్చింది. నిజానికివి అన్నీ 'రూపగుణాలు' మట్టి గుణాలు కావు. రూపం మాయానిర్మితం. కనుక మిథ్య. అందువలన శబ్ద, రూప, రసాదులు బ్రహ్మమునకు చెందవు. అవి మాయాకల్పిత జగత్తువి. అయితే ఈ గుణాలన్నింటికి 'మట్టి' వలె బ్రహ్మము సాక్షిగా, ఆధారంగా వుంటుంది. ఈ గుణాలన్నీ ప్రళయంలో నశించినా– కుండ పగిలినా మట్టి మిగిలినట్లు–బ్రహ్మం అలాగే వుంటుంది అని అర్థం. అందువలన బ్రహ్మం సాక్షి కేవలం. నిర్గుణం, శేషి. 'శేషం' గూడా అదేనట. అదేమిటి? అంటే 'శేషానికి, వేఱే అస్తిత్వం లేదు. అది శేషి మీద భ్రాంతితో ఏర్పడినదే. కనుక 'శేషం' గా దేనిని భావిస్తున్నామో అది శేషియే. అంటే నామరూపములు మిథ్యలే. వాటిస్థానంలో మనం చూస్తున్నది, ఆ ఆకారాల్లో



తులసి. తులసి ఎలా సగుణమో ఈ దేహమాలికలూ సగుణములే. దాని మంజరులు అనగా జ్ఞానబల క్రియలు. వాటిని ధరించినది కనుక 'జ్ఞానబలక్రియాధరమయిన ఆత్మ తులసీ మంజరీధరము'. భగవంతుని శక్తి గురించి వేదవాక్యము మూలమున గలదు.

**శ్లో॥ జ్యాయాన్భూమేర్దివో జ్యాయాన్జ్యాయాన్వ్యోమ్న స్తథైవ చ।**
**జ్యాయాన్లోకేభ్య ఏతేభ్యో జ్యాయానణ్డాదపి శ్రుతః॥ 69**

దివో ద్యులోకాత్ వ్యోమ్నోఽ న్తరిక్షలోకాత్. అణ్డాద్బ్రహ్మాణ్డాత్ జ్యాయానితి శ్రుతః. 'జ్యాయాన్పృథివ్యా ఇత్యాది శ్రుతేరితి భావః.

**అనువాదం :** ద్యులోకం అనగా స్వర్గలోకం కన్న గొప్పవాడు. అంతరిక్ష లోకం (వ్యోమ) కన్న గొప్పవాడు. బ్రహ్మాండము కన్న గొప్పవాడు–జ్యాయాన్ అనగా గొప్పవాడు. ఈ అర్థం గల వేదవాక్యం వలన ఈ నామములు.

**శ్లో॥ మేరోరప్యున్నతస్సిన్ధోరప్యగాధశ్చ విస్తృతః।**
**భూపద్మాదపి సూక్ష్మశ్చ వాలాగ్రాదపి విశ్రుతః॥ 70**

విస్తృతో విస్తీర్ణః. వాలం కేశః

**అనువాదం :** విస్తృతః అనగా విస్తీర్ణమయినవాడు. వాలం అనగా కేశము అని అర్థము.

**శ్లో॥ నస్త్రీ నషణ్డో నపుమాన్ నజన్తుర్నాప్యసన్నసన్।**
**నదేవో నాసురోఽ మర్త్యో నతిర్యఙ్నఫణీ నవిః॥ 71**

ఏవమధ్యారోపం దర్శయిత్వా తదపవాదం దర్శయతి. నేత్యాదిభిశ్శ్లోకైః . జన్తుః స్త్రీత్వాదిధర్మరహితప్రాణిమాత్రమ్. అసన్ శశశృఙ్గాదిః, సన్ జన్మనా లబ్ధసత్తాకః పదార్థః న తు పారమార్థికసత్తావాన్. విః పక్షీ.

**అనువాదం :** ఇంతవరకు అధ్యారోపము చూపి ఈ శ్లోకం నుంచి **అపవాదము**ను చూపుచున్నాడు.

జంతువు అనగా స్త్రీత్వము మొ॥ ధర్మములు లేని కేవల ప్రాణి. అంటే 'జీవుడు'. అసన్ అనగా కుందేలు కొమ్ములాంటి అసలు లేని పదార్థములు.

సృష్టి ప్రారంభమున సంకల్పించుట వలన 'వశిష్ఠుడు'. 'శక్తి–శక్తిమంతుడు' ఇద్దఱి మధ్య ఎక్కువ భేదము లేదు కనుక ఆత్మను 'శక్తి' అనవచ్చును. సర్వము శిథిలము చేయబడును కనుక పరాశరుడు. ఆచరింపజేయును కనుక ఆచార్యుడు. ఉపదేశింపబడును కనుక 'సంప్రదాయము'. సంప్రదాయ కర్తలయిన బ్రహ్మవశిష్ఠాది పరంపరలకు కర్త కనుక 'సంప్రదాయకృత్'. సంప్రదాయమునకు నారాయణుడు ఆదిగురువు కదా!

(నారాయణ సమారంభామ్)

**శ్లో॥ శంఖీ చక్రీ ధ్వజీ లింగీ త్రిపుణ్డ్రీ భస్మరూషితః।**
**రుద్రాక్షమాలికాభృచ్చ తులసీమఞ్జరీధరః॥ 68**

శం సుఖం తదభిన్నం ఖం గగనం శంఖం, శమితి మా న్తమవ్యయమ్. తదస్యాస్తి స్వరూపత్వేనేతి శంఖీ, చక్రం మాయానిబర్హణం తేజోఽస్యాస్తీతి చక్రీ. ధ్వజః భక్తత్రాణయశః పతాకాస్యాస్తీతి ధ్వజీ. లింగం చిహ్నం జ్ఞాపకం సత్యత్వాదికమస్యాస్తీతి లింగీ. త్రిమూర్తిధరత్వాత్త్రిపుణ్డ్రీ. భస్మనా తద్వన్నిర్వీర్యేణాజ్ఞానేన రూషితః భస్మరూషితః. రోదయన్తి సంసారకూపే నిపాత్య ప్రాణిన ఇతి రుద్రాణి అక్షాణీన్ద్రియాణి, తేషాం మాలికాం బిభర్తీతి తద్భృత్. ఈశ్వరేణ హి ధృతా దేహాది సంహతిః. తులసీవ సగుణా మాయా తులసీత్యుచ్యతే. తస్యామఞ్జర్యశ్శక్తయః జ్ఞానబలక్రియాత్మికాః తద్ధరః 'పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా' చేతి శ్రుతేః.

**అనువాదము :** సుఖస్వరూపమయిన ఆకాశరూపము గలది కనుక ఆత్మ 'శంఖి'. చక్రము అనగా మాయాహరమయిన తేజస్సు కలవాడు కనుక 'చక్రి'. ధ్వజము అనగా భక్తరక్షణ కీర్తి పతాకగా గల వాడు కనుక 'ధ్వజి'. సత్యజ్ఞాన మొ॥ చిహ్నములు గలవాడు కనుక 'లింగి'. త్రిమూర్తులు గలవాడు కనుక త్రిపుండ్రి. అజ్ఞాన రూపము అయిన భస్మం చేత మనకు తెలియకుండా కప్పివేయబడినవాడు. సంసార కూపమున మనలను పడవేసి ఏడిపించునవి కనుక ఇంద్రియములను 'రుద్రములు' అనవచ్చును. రుద్రములయిన అక్షములు (ఇంద్రియములు) రుద్రాక్షములు. రుద్రాక్ష మాలికను ధరించినవాడు కనుక 'రుద్రాక్షమాలికాభృత్'. ఈశ్వరుడు సర్వవ్యాపి అయి ధరించిన దేహమాలిక



వ్యాప్తమయినది మట్టి. కనక శేషం గూడా మట్టియే అన్నట్లు ప్రపంచం గూడా బ్రహ్మమే అని తాత్పర్యము.

**శ్లో॥ కూటస్థోఽవ్యాకృతో మాయీ కారణప్రకృతిర్నరః।**
**కర్తా భోక్తా చ మన్తా చ విజ్ఞానాత్మా మహామనాః॥ 11**

ప్రకృతిరుపాదానం. న రీయతే న క్షీయతే ఇతి నరః.

**అనువాదం :** ప్రకృతి అంటే ఉపాదానము. అంటే బ్రహ్మము నుండియే ప్రకృతి వచ్చినది. నరః–క్షయింపనివాడు.

**వివరణ :** ప్రపంచానికి ఉపాదాన కారణము ప్రకృతి. ఆ ప్రకృతి బ్రహ్మశక్తి. అది జడం. దానిలోనికి ప్రతిబింబించిన బ్రహ్మము సగుణ బ్రహ్మము. ఆయనయే సృష్టికారణము. కనుక ప్రకృతియు బ్రహ్మమే. నరః అంటే జీవతత్త్వం. జీవునకు జనన మరణాలు లేవు. అవి కేవలం శరీరానికే. కుండ పుట్టుంది. పగులుతుంది. కాని కుండలో ఉన్న 'ఆకాశం' యథా ప్రకారంగా వుంటుంది. అలానే 'ఆత్మకు చావు లేదు. కనుక నరః అని పేరు.

**శ్లో॥ శ్రోతాఽకర్తా ప్రభోక్తా చ ధాతాఽఽనన్దమయస్స్వభూః।**
**వామనీర్భామనీశ్చైవ శుక్లవర్ణో హిరణ్మయః॥ 12**

ధత్తే సర్వమితి ధాతా స్రష్టా 'ధాతా ధాతౄణా' మితి శ్రుతేః. స్వేనైవ భవతీతి స్వభూః.వామాని నయతీతి వామనీః. భామాని నయతీతి భామనీః.

**అనువాదం :** అన్నింటిని ధరించి పోషిస్తాడు కనుక ధాత. అట్టి పోషకులకు గూడా పోషకుడు అని శ్రుతి. స్వయంగా ఉద్భవించిన వాడు కనుక స్వభూః అని నామం. వామములను అంటే పుణ్యఫలములను అందించువాడు కనుక 'వామనీః' సర్వలోకాలకు ప్రకాశాన్నిస్తాడు కనుక 'భామనీః' అని నామం.

**వివరణ :** ఛాందోగ్యంలో వామనీః, భామనీః అనే విషయాలున్నాయి. మన నేత్రమధ్యంలోకి తొంగిచూస్తే కనబడే పురుషుడే చైతన్యము 'ఆత్మ'. ఈ ఆత్మకు 'ఉత్' అని ఒకపేరు. సంయద్వాముడని ఒకపేరు. వామనీః అని ఒకపేరు. భామనీః అని మఱొక పేరు. వామములు అంటే పుణ్య కర్మలు అని శంకర

భాష్యం. అట్టి పుణ్యకర్మలను వాటి ఫలాలను ప్రసాదించువాడు 'వామనీః' అట.

'భామనీ రేష సర్వేషు లోకేషు భాతి' సర్వలోకాలలో ప్రకాశిస్తాడు కనుక ఆత్మ 'భామనీః' అట, కర్తగా ఉండి సమస్త పుణ్యాపాప ఫలములను శరీరాభిమానికందించేది, వీటికతీతంగా సర్వ లోకాలలోను, సర్వ దేహాలలోను ప్రకాశించేది ఈ 'ఆత్మ'యే.

**శ్లో॥ వామనో౽ఙ్గుష్ఠమాత్రశ్చ హృదయస్థో జనార్దనః।**
**సోమో రాజా చ మూర్ధా చ తేజస్వీ పాణ్డరామ్బరః॥ 13**

'మధ్యే వామనమాసీనం విశ్వేదేవా ఉపాసత' ఇతి శ్రుతేర్వామనః. అఙ్గుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠ' తీతి శ్రుతేరఙ్గుష్ఠమాత్రః. జనానర్దయతి ప్రళయకాలే ఇతి జనార్దనః. సోమాదినామాని చన్ద్రమణ్డలాదిస్థ పురుషస్య బృహదారణ్యకే ప్రసిద్ధాని.

**అనువాదం :** "హృదయపుండరీకమధ్యంలో ఉన్న వామనుడైన (అంటే పొందదగిన) ఆత్మను సమస్త దేవతలు ఉపాసించెదరు' అని 'కఠం' చెప్తున్నది. అందువలన ఆత్మ "వామనుడు". అంగుష్ఠ మాత్రుడైన పురుషుడు శరీర మధ్యంలో వున్నాడని మఱొక శ్రుతి చెప్పింది. అందువలన 'ఆత్మ' అంగుష్ఠ మాత్రం. ప్రళయకాలంలో జనులను అర్దనం అనగా లయం చేస్తాడు కనుక 'ఆత్మ' జనార్దనుడు. 'సోమ' మొదలయిన నామములు చంద్రమండలం మొ॥ స్థానాలలో ఉన్న పురుషునకు పేర్లు. ఇవి బృహదారణ్యంలో ఉన్నాయి.

**వివరణ :** వామనుడు అంటే పొట్టివాడని అర్థం. కాని అంగుష్ఠ మాత్రుడన్నా అదే అర్థం. కాని శంకరభాష్యంలో 'వామనః' అంటే 'వననీయః' అనగా భజనీయుడు పొందదగినవాడు అని అర్థం చెప్పారు. అందువలన పునరుక్తి లేదు.

**శ్లో॥ బృహచ్ఛ్రవా హరిర్ధంసో వైద్యుతశ్చాక్షుషో హరః।**
**వాసుదేవో వామదేవః పుణ్డరీకేక్షణః కవిః॥ 14**

శ్రవో యశః హరతి ప్రాపయతి సర్వమాశ్రితానితి హరిః. హరతి



అకర్త. సాక్షి మాత్రమే. ఏ పని చేయదు. కనుక సృష్టిని లయింపజేయటం అనే పని నిర్గుణమయిన ఆత్మది కాదు. సృష్టి అంతా మాయ. మాయ అంటే ఉన్నదో లేదో తెలియని ఒక భ్రాంతి. అది బ్రహ్మ సన్నిధానంతో కఱిగిపోతుంది. కనుక లయింపజేయడం అనేది బ్రహ్మయందు ఆరోపింపబడినది. సూర్యుడు వచ్చినప్పుడు మంచు కఱుగుతుంది. కాని సూర్యుడు తనుగా పూనుకొని కఱిగించడు. ఇదీ అంతే. కనుక బ్రహ్మం 'అనిలయనం'. ఈ పదం '66'లో రాబోతున్నది.

**శ్లో॥ జ్యౌతిషం చానిలయనం కల్పో వ్యాకరణ స్తథా**
**పురాణమపి ధర్మశ్చ మహాభారతమవ్యయమ్ 66**

జ్యోతిరేవ జ్యౌతిషమ్. కల్పయతీతి కల్పః. వ్యాక్రియతే నామరూపే అనేనేతి వ్యాకరణమ్. పురాపి నవం పురాణమ్. ధ్రియతే ఇతి ధర్మః. మహత్యాం భాయాం బుద్ధౌ రతం మహాభారతం సూక్ష్మబుద్ధిగమ్యమిత్యర్థః.

**అనువాదం :** 'జ్యోతి' కనుక ఆత్మయే జ్యౌతిషము. కల్పించును కనుక కల్పము. నామరూపములు సృష్టించును కనుక 'వ్యాకరణము'. సనాతనుడయినను నేటికి ఉన్నాడు కనుక పురాణము. ధరింపబడుచున్నది కనుక ధర్మము. గొప్ప కాంతి అయిన బుద్ధియందు గమ్యం అయినది కనుక 'మహాభారతము' ఆత్మ. (మహాభా అనగా గొప్ప కార్యము).

**శ్లో॥ వ్యాసశ్శుకో వశిష్ఠశ్చ శక్తిశ్చాపి పరాశరః।**
**ఆచార్యస్సమ్ప్రదాయశ్చ సమ్ప్రదాయకృదేవ చ॥ 67**

వ్యస్యతి విక్షిపతి సర్వమితి వ్యాసః. శోచతి భిభేత్యస్మాత్సంసార ఇతి శుకః. వష్టి కామయతే బహుస్యామితి వశిష్ఠః. శక్తి తద్వతోరభేదోపచారాచ్ఛక్తిః . పరాశీర్యతే సర్వమనేనేతి పరాశరః. ఆచారయతీత్యాచార్యః. సమ్ప్రదీయతే ఉపదిశ్యత ఇతి సమ్ప్రదాయః. సమ్ప్రదాయకృద్బ్రహ్మా వశిష్ఠాది పరమ్పరా కర్తా. నారాయణస్యైవాదిత్వాత్తస్యాః.

**అనువాదం :** సమస్తమును విక్షేపించును కనుక వ్యాసుడు. ఆత్మ నుండి సంసారము భయపడును కనుక 'శుకము'. నానా రూపధారిని కావలయునని

**శ్లో॥ తర్కో న్యాయస్సఙ్గ్రహశ్చ సూత్రం సూత్రార్థ ఏవ చ।**
**నిరుక్తం చానిరుక్తం చ ఛన్దో నిలయనం తథా॥ 65**

తర్క్యత ఇతి తర్కః. నితరామాసమన్తాద్యాతీతి న్యాయః. సంగృహ్యతే సర్వమత్రేతి సంగ్రహః భూతమాలాయాః సూత్రవదాధారత్వాత్సూత్రమ్. సూత్రయతి వేష్టయతి సర్వమితి వా సూత్రమ్. సూత్రాణాం శారీరక సూత్రాణామర్థః అభిధేయస్సూత్రార్థః. సూత్రేణ హిరణ్యగర్భేణ అర్థ్యత ఇతి వా సూత్రార్థః. 'నిరుక్తం చానిరుక్తంచ, నిలయనం చానిలయనం' చేతి శ్రుతేరాహ– నిరుక్తమిత్యాది. ఛన్దయతీతి ఛన్దః. వేదవాగ్భిరజ్ఞానాం ప్రరోచకః

**అనువాదం :** తర్కింపబడును కనుక తర్కుడు. మిక్కిలిగా అంతటా సంచరించును కనుక న్యాయుడు. సమస్తము ఈయన యందే సంగ్రహింపబడును కనుక సంగ్రహుడు. పంచభూతమాలికకు సూత్రము వలె ఆధారము కనుక సూత్రుడు. లేదా సమస్తమును సూత్రించును అనగా పరివేష్టించును కనుక సూత్రుడు. శారీరక సూత్రములకు చెప్పదగిన అర్థము అయినవాడు కనుక సూత్రార్థ స్వరూపుడు. సూత్రాత్మ అయిన హిరణ్యగర్భుని చేత అర్థింపదగినవాడు కనుక సూత్రార్థ స్వరూపుడు. 'నిరుక్తం' అని, అనిరుక్తం అని నిలయనం అని అనిలయనం అని వేదవాక్యం. అందువలన ఆ పేర్లు చెప్పబడినవి. వేదవాక్కుల ద్వారా అజ్ఞులకు ఇష్టం అయ్యేటట్లుగా చెప్పబడును కనుక ఛందుడు.

**వివరణ :** నిరుక్తం–ఆత్మను గూర్చి అనేక విధాలుగా నిర్వచనాలు ఉన్నాయి. వేద ఆగమ పురాణాదులలో ఆత్మను గూర్చి, చెప్పటం స్పష్టమే. కనుక 'ఆత్మ'–నిరుక్తం అనవచ్చును. కాని మనస్సుకు గూడా అందని ఆత్మ గూర్చి ఏమి చెప్పినా తరుగదు. ఇంకా చెప్పవలసియుంటుంది. కనుక ఆత్మ అనిరుక్తము.

ఇక 'నిలయనం' అంటే ఆత్మయందు సమస్త మాయాకల్పిత సృష్టి లయం చెందుతుంది. అలాగే సగుణశంకరరూపంతో గాని, జ్ఞానరూపంతోగాని ఈ సమస్తమయిన విశ్వాన్ని లయింపజేస్తుంది ఆత్మ. కనుక అది నిలయనం. కాని అది 'అనిలయనం' గూడా అవుతుంది. ఎందుకంటే, బ్రహ్మం నిజానికి



సర్వమాశ్రితానాం దుఃఖమితి వా హరిః. హరతి సర్వం జగదితి హరః. వైద్యుతో విద్యున్మణ్డలస్థః చాక్షుషః. చక్షుస్థః వామస్సున్దరో మనోహరో భజనీయ ఇతి యావత్. పుణ్డరీకేక్షణః 'కప్యాసం పుణ్డరీక' మితి శ్రుతేః. కవిః క్రాన్తదర్శీ.

**అనువాదం :** శ్రవః అనగా వినబడేది అనగా కీర్తి. ఆశ్రితులకు సర్వం తెచ్చి యిచ్చేవాడు అను అర్థంలో 'హరి' లేదా ఆశ్రితుల దుఃఖాలను హరించేవాడు అని చెప్పవచ్చును. వైద్యుతుడు అంటే విద్యున్మండలంలో ఉండేవాడు. చాక్షుషః – కంటియందు ఉండేవాడు. వామః అనగా సుందరమయినవాడు లేదా సేవింపదగినవాడు. 'కప్యాసం' అనగా కోతి ముడ్డి వంటి రంగుగల పద్మము వంటి ఎఱ్ఱని కన్నులు గలవాడు. ఇది శ్రుతిలో చెప్పిన పోలిక. కవి అనగా అతీతంగా దర్శించగలవాడు.

**వివరణ :** అక్షిపురుషోపాసన ఛాందోగ్యంలో ఉంది. దాని ప్రకారం మన కండ్లలో దక్షిణనేత్రంలో కనిపించే 'చైతన్యం' ఆత్మ అని గుర్తించాలి. 'కోతిముడ్డి' అనే ఉపమానం నీచోపమ. అయినా దానిని ప్రత్యక్షంగా భగవన్నేత్రానికి చెప్పలేదు. కమలంతో చెప్పారు. ఆ కమలంతో భగవన్నేత్రానికి ఉపమానం చెప్పింది శ్రుతి. కనుక నీచోపమ కాదని ఛాందోగ్య భాష్యం చెప్పింది.

అయినా మఱొక ఉపనిషత్తులో 'సర్వం నారాయణుడే' అని ఉంది.

"విసర్జనీయం నారాయణః" అని చెప్పబడినది. కనుక శ్రుతికి దోషశంకలు అంటించడం అనవసరం. తత్త్వం ముఖ్యం.

**శ్లో॥ అన్తర్యామీ హృషీకేశో రామః కృష్ణశ్చతుర్భుజః।**
**విశ్వమ్భరో విశ్వగర్భః పద్మనాభోఽఖిలప్రియః॥ 15**

హృషీకాణాం విషయేన్ద్రియాణామీశః హృషీకేశః. 'ఏష త ఆత్మాఽన్తర్యామ్యమృత' ఇతి శ్రుతే రన్తర్యామీ. రమన్తేఽస్మిన్విబుధా ఇతి రామః. 'కృషి ర్భూవాచక శ్శబ్దో ణశ్చ నిర్వృతి వాచకః. తయోరైక్యమ్పరమ్బ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే' చత్వారః పురుషార్థాధర్మాదయః వేదా ఇతి వా. భుజా యస్య స చతుర్భుజః. పద్మం జగన్నాభౌస్యాన్తర్యస్య స పద్మనాభః. మాయామయ పరమాత్మ గతత్వాజ్జగతః.

**అనువాదం :** హృషీకములు అనగా ఇంద్రియములు. వానికి విషయములయిన పదార్థములు. కంటికి దృశ్యములు చెవికి శ్రవ్యములు మొ వాటికి ప్రభువు. కనుక ఆత్మ హృషీకేశుడు. 'ఈ ఆత్మ అమృతతత్త్వం. సర్వ జీవులకు సమస్త విశ్వానికి అంతర్యామి' అని శ్రుతి. అందువలన ఆత్మ అంతర్యామి. పరమాత్మయందు సమాధిలో జ్ఞానులు అనుసంధానంతో ఆనందపడతారు కనక 'ఆత్మ'కు రాముడని పేరు. 'కృషి అనగా భూమి' 'ణ' అనగా ఆనందం. ఈ '2' ఐక్యం చెందటమే బ్రహ్మతత్త్వం – కనుక కృష్ణ శబ్దము 'ఆత్మ'కు పేరు. 4 పురుషార్థాలు లేదా 4 వేదాలు భుజాలుగా గలవాడు చతుర్భుజుడు. పద్మం అంటే వికాస సంకోచములు గల ఈ ప్రపంచమే. అది నాభియందు అనగా తన లోపల గలవాడు కనుక 'ఆత్మ' పద్మనాభుడు. జగత్తు అంతయు మాయమయుడైన పరమాత్మలో ఉన్నది కనక.

**వివరణ :** విషయాలు, ఇంద్రియాలు. వీనికి ఆత్మ ప్రభువు. ఎందువలన? శరీరంలోని ఇంద్రియాలు 'ఆత్మ'కు వివిధ పదార్థాలను అందించి అలరిస్తాయి! అంతేకాదు శరీరంలో ఆత్మ చైతన్యం ఉంటేనే ఇంద్రియాలకు శక్తి చలనం. అవి తెచ్చే 'దృశ్యం' మొ॥ పదార్థాలకు ప్రయోజనం. గుడిలో దేవుడుంటేనే గుడికి పూజలకు సార్థకత. గుడి ఆకారంలో శ్మశానంలో కట్టే సమాధులకు ఏమి సార్థకత?. కనక ఆత్మ, విషయేంద్రియాలకు ప్రభువు. కనుక హృషీకేశం 'ఆత్మ'.

కృషి=భూమి. అనగా శరీరం అనగా శరీరాభిమాని అయిన విశ్వజీవుడు. ణ=ఆనందం అనగా ఆనందస్వరూపం అయిన ఆత్మ. ఈ '2' ఐక్యము అనగా 'అహం బ్రహ్మ సర్వం ఖల్విదం బ్రహ్మ' అని తత్త్వానుసంధానము జ్ఞానము. ఆ జ్ఞానమే బ్రహ్మ. కనుక జీవుడు కృష్ణుడు. ఈ ప్రపంచమంతా ఉన్నదనుకొన్న పక్షమున దీనికి లోపల బయట ఆధారముగా అధిపతిగా అవధిగా భగవంతుడు ఉన్నాడు. ఒకకుండ ఉన్నది. దానిలోపల ఆకాశం ఉంది. ఉంటేనే అది కుండ. దానిబయట ఆకాశం ఉంది. ఉంటేనే కుండ తయారయింది. కనుక కుండకు ఆకాశం అంతర్యామి. బహిర్వ్యాపి. ఇది అంతర్యామి పద్మనాభుల తత్త్వము.



తెలిసికొనబడును కనుక ప్రత్యయము (జ్ఞానము) అని పేరు. శబ్దము చేత చెప్పబడును కనుక శబ్దము. ధరించి పోషించును కనుక 'ధాతువు'. వేదం కూడా పరమాత్మకు 'ధాతు' అనే శబ్దాన్ని ఉపయోగించినది. నశించదు కనుక అవ్యయము. ప్రపంచమునకే మొదటి జ్ఞానం కనుక 'ప్రథమా' అని పేరు. మాయా సమేతుడు కనుక మాయకు ఈయన తోడుగా కలడు కనుక 'ద్వితీయా'. జీవుడు ఈశ్వరుడు– అనుకొన్న పక్షమున పరమాత్మ 3వ వాడు కనుక తృతీయా. ఈశ్వరత్రయం దృష్ట్వా (రుద్ర, ఈశ్వర, సదాశివ, విరాట్, హిరణ్యగర్భ మొ॥ బేధములు) పరమాత్మ '4' వవాడు. కనుక 'చతుర్థీ' అని పేరు.

**శ్లో॥ పఞ్చమీ చైవషష్ఠీ చ సమ్బుద్ధిస్సప్తమీ తథా।**
**గద్యమ్పద్యం సమాసశ్చ కావ్యం నాటకమవ్యయమ్॥ 64**

జీవతత్సాక్షీశ్వరతత్సాక్ష్యపేక్షయా పఞ్చమీ. ఆకాశాదిస్వజన్యపఞ్చ భూతాపేక్షయా ఆత్మనష్షష్ఠత్వాత్షష్ఠీయం చితః. అన్తఃకరణబహిష్కరణషట్కా పేక్షయా సప్తమీ సమ్యగ్జ్ఞానం సమ్బుద్ధిః. గదితుం యోగ్యం గద్యమ్. పత్తుం ప్రాప్తుం యోగ్యం పద్యమ్. సర్వం జగదత్ర సమస్యతే సంక్షిప్యతే ఉపసంహ్రియత ఇతి సమాసః. వర్ణనీయత్వాత్కావ్యమ్. కవేర్విదుషో భావస్తత్త్వం వా కావ్యమ్. సర్వే ప్రాణినో నటా ఇవాముమాశ్రిత్య నటన్తీతి నాటకమ్ అయమ్.

**అనువాదం :** జీవుడు సాక్షి అయిన ఈశ్వరుడు. ఈశ్వరసాక్షి–వీరి దృష్ట్వా 5వ వాడు కనుక 'పంచమీ'. ఆత్మనుంచి పుట్టిన పంచభూతముల దృష్ట్వా ఆత్మ ఆఱవవాడు కనుక 'షష్ఠీ'. అంతఃకరణము ఇంద్రియములు 5. వీనిదృష్ట్వా ఆత్మ '7'వది కనుక 'సప్తమీ'. మంచి జ్ఞానం కనుక 'సంబుద్ధి'. చెప్పదగినది కనుక గద్యము. పొందదగినది కనుక పద్యము. సమస్త జగత్తు బ్రహ్మమునందు లీనమగును కనుక 'సమాసం'. వర్ణింపదగినది కనుక కావ్యము. లేదా కవి అనగా సృష్టికర్త పండితుడు, అతని శక్తి 'ఆత్మ–యే కనుక 'ఆత్మ' కావ్యము. సర్వ ప్రాణులు నటులవలె ఆత్మను ఆశ్రయించి నటించును కనుక ఆత్మ 'నాటకము'.

**శ్లో॥ మహత్కర్మ మహత్పుణ్యం మహద్ధ్యానం మహత్తపః।**
**మహద్జ్ఞానం మహద్భాగ్యం మహద్భోగో మహత్క్రతుః॥ 60**

అత్రాపి మహతాం కర్మ మహత్కర్మేత్యేవం షష్ఠీతత్పురుషా ఏవ.

**అనువాదం :** ఇందులో గూడా మహాత్ముల యొక్క కర్మ 'మహత్కర్మ' మొ॥ షష్ఠీతత్పురుషలు సరిపోవును.

**శ్లో॥ మహద్వీర్యం మహత్సత్త్వం మహద్ధైర్యం మహద్వనమ్।**
**మహత్ప్రాణో మహత్ప్రేయో మహచ్ఛ్రేయో మహత్పితా॥ 61**

ప్రేయః ప్రియతరః. శ్రేయః ప్రశస్యతరమ్.

**అనువాదం :** ప్రేయః అనగా అత్యంత ప్రియమైనది. శ్రేయః మిక్కిలి ప్రశంసనీయమయినది.

**శ్లో॥ మహన్మాతా మహద్భ్రాతా మహద్రాజో మహత్సఖః।**
**మహద్బన్ధుర్మహద్భర్తా మహద్భార్యా మహద్గురుః॥ 62**

సర్వదా చిత్తే భరణీయత్వాద్భార్యా. భర్తృత్వాద్భర్తా. మహాన్తో విద్వాంసో బ్రహ్మవిదః.

**అనువాదం :** ఎల్లపుడు మనస్సులో ధరించదగినది కనుక 'ఆత్మ' మహద్భార్య. శరీరాదులను భరించువాడు కనుక 'ఆత్మ' మహద్భర్త'. మహాత్ములు అనగా బ్రహ్మవేత్తలు.

**శ్లో॥ విభక్తిః ప్రత్యయశ్శబ్దో ధాతురవ్యయమవ్యయమ్।**
**ప్రథమా చ ద్వితీయా చ తృతీయా చ చతుర్థికా॥ 63**

వివిధం విశేషేణ వా భజ్యతే సేవ్యత ఇతి విభక్తిః. ప్రతీయత ఇతి ప్రత్యయో జ్ఞానమితి వా. శబ్ద్యత ఇతి శబ్దః. దధాతీతి ధాతుః. 'ధాతుః ప్రసాదా న్మహిమాన' మితి శ్రుతేః. నవ్యేతీత్యవ్యయమ్, జగదాదిత్వాత్ప్రథమాచితిః మాయాయుక్తత్వాత్తదపేక్షయా ద్వితీయా. జీవేశ్వరద్వయాపేక్షయా తృతీయా ఈశ్వర త్రయాపేక్షయా వా చతుర్థీ. సైవ చతుర్థికా.

**అనువాదం :** వివిధ పద్ధతులతో, విశేషంగా సేవింపబడును కనుక 'విభక్తి'.



**శ్లో॥ నిష్ప్రపఞ్చో నిరాభాసస్సర్వాభాసశ్చ సర్వకృత్।**
**సర్వభృత్సర్వదూరశ్చ తమసః పర ఊర్ధ్వగః॥ 16**

నిర్గత ఆభాస స్సూర్యాదేర్యస్మాత్స నిరాభాసః. 'తమసః పరస్తా' దితి శ్రుతేస్తమసః పరః. అజ్ఞానాత్పరః.

**అనువాదం :** 'ఆత్మ' యొక్క కాంతి సూర్యాదుల నుండి నిర్గతమవుతుంది. కనుక నిరాభాసం ఆత్మ. అజ్ఞానం కన్న అవతలనున్నవాడు కనక తమసః పరః అనవచ్చును.

**వివరణ :** ప్రపంచంలో ఎక్కడ ఏ జ్ఞానం ఉన్నా అది పరమాత్మ యొక్క అంశయే. సూర్యాదులు చీకటిని అజ్ఞానాన్ని పోగొడ్తారు. వారికి ఆ శక్తి ఎక్కడిది? ఆత్మనుండి వచ్చినది. శరీరంలో కంటి నుండి కనబడేది ఆత్మచైతన్యం. అదే అక్షి పురుషుడు. అట్టివాడే ఆదిత్య పురుషుడు. ఆదిత్య మండలంలో ఉండే పురుషుడు. ఈ ఇద్దఱు ఒకే ఆత్మచైతన్యం అని శ్రుతి. 'భర్గో దేవస్య' అని గాయత్రీలో చెప్పింది ఈ 'దేవత' యొక్క కాంతినే. సూర్యుని కాక సూర్యునిలోని కాంతిని ఆరాధించుట. గాయత్రీతత్త్వం. దేవిని, విష్ణువును, శివుణ్ణి పరమాత్మను సూర్యమండలంలో చంద్రమండలంలో కొలువుదీఱినట్లు వర్ణిస్తారు.

"ధ్యేయస్సదాసవితృమండలమధ్యవర్తీ
నారాయణస్సరసిజాసన సన్నివిష్టః" అని,
"మార్తాండ మండలారాధ్యా" - అని స్మృతి వాక్యాలు.

**శ్లో॥ అధోగః పూర్వదిక్స్థశ్చ పాశ్చాత్యో దక్షిణాస్థితః।**
**ఉత్తరస్థో విదిక్స్థశ్చ శ్వస్థో హ్యస్థోఽధునాతనః॥ 17**

'స ఏవాద్య స ఉ శ్వ' ఇత్యాది శ్రుతేః.

**అనువాదం:**రేపటివాడు,నేటివాడు,నిన్నటివాడు అనగా శ్వస్థః,అధునాతనః, హ్యస్థః అని నామములు. వేదంలో 'వాడే నేడు, వాడే రేపు' అని చెప్పబడినది.

**వివరణ :** ఆత్మ అనంతం. అనాది. అమృతం, అఖండము కనుక నిన్న,రేపు, మొన్న, నేడు, ఎల్లుండి-ఎప్పుడైనా, ఎక్కడైనా ఉంటాడు. 'ఆత్మ' కాక మిగిలిన

మాయాపదార్థాలు దృశ్యములు నశ్యములు అవుతుంటాయి. 'ఆత్మ' మాత్రము అదృశ్యం, అనశ్యం. ఈ నామాలన్నింటి సారాంశం అదే.

**శ్లో॥ భూతలోకో భవ్యలోకో భవిష్యల్లోక ఏవ చ।**
**దృష్టశ్రుతో మతో జ్ఞాతో నిశ్చితో విమతః స్మృతః॥ 18**

విమతస్సన్దిగ్ధః స్మృతః స్మరణం ప్రాప్తః. దృష్ట శ్రుతాదికం సర్వం వస్తు పరమాత్మైవేత్యర్థః.

**అనువాదం :** విమతః అనగా సందేహాస్పదము అయినది. స్మృతః గుర్తు తెచ్చికోబడినది. అంటే చూచినది విన్నది అంతా పరమాత్మయే అని మాటిమాటికి స్మరింపబడేది ఆత్మ.

**వివరణ :** 'మతః–విమతః' 'అస్తీత్యేకే నాయమస్తీతిచైకే' అని కఠోపనిషత్తులో చెప్పినట్లు 'ఆత్మ' విషయం ఎల్లపుడు ఆస్తిక నాస్తిక దర్శనాల మధ్య డోలాయమానంగా ఉంటుంది. కనక 'ఆత్మ' విమతం.

**శ్లో॥ శ్రోతవ్యో మననీయశ్చ ధ్యాతవ్యస్సేవ్య ఈదృశః।**
**యాదృశస్తాదృశశ్చాన్యాదృశోఽతర్క్యోఽప్యతీన్ద్రియః॥**

'శ్రోతవ్యోమన్తవ్యో నిదిధ్యాసితవ్య' ఇతి శ్రుతేరాహ శ్రోతవ్య ఇత్యాది. లోకే యద్వస్తు ఈదృశయాదృశాదిశబ్దైరుచ్యతే తత్సర్వం పరమాత్మె వేత్యాహ ఈదృశ ఇత్యాది. అన్యాదృశో విలక్షణః.

**అనువాదం :** ఆత్మపదార్థం శ్రవణం, మననం అంటే నిరంతర చింతనం, ధ్యానం చేయదగినదని వేదము చెప్పినది. కనుక 'ఆత్మ–శ్రోతవ్యం. లోకమునందు కనబడే ప్రతి వస్తువు ఆత్మస్వరూపమే. అందువలన ఇటువంటిది అటువంటిది మొ॥ పోలికలు చేత చెప్పబడేది 'ఆత్మ'యే. వీటి అన్నింటికన్న భిన్నమయిన తత్త్వము గలది ఆత్మయే.

**వివరణ :** అగ్నియు ఆత్మయే. భిన్నము అయినది ఆత్మయే అన్నారు. అది ఎలా కుదురుతుంది? ఎలా అంటే ఇలా కుదురుతుంది. నగలు బంగారమే. నగల కన్న భిన్నమయినది బంగారమే. నగలు అంటే కల్పితమయిన నామరూపములే కనుక తత్త్వరీత్యా అది బంగారమే. నామరూపములు



సర్వవ్యాపకము పరిమితి అవధి లేనిది కనుక సర్వము. ఇతరమయిన ప్రపంచం సర్వం కాదు కనుక పరిమితి అవధి ఉన్నది కనుక బ్రహ్మము వంటిది కాదు. వ్రీహి మొ॥ అయినవి, హుతము, ప్రహుతము, పాలు, ప్రాణము, మనస్సు, వాక్కు ఇవి '7' అన్నములు. వీనిని కల్పించువాడు కనుక 'సప్తాన్నకల్పకు'డని పేరు.

**శ్లో॥ మహద్యశో మహద్భూతం మహదైశ్వర్యమేవ చ।**
**మహత్పదం మహద్రాజ్యం మహద్ధాన్యం మహద్ధనమ్॥ 58**

'తస్య నామ మహద్యశః' ఇతి శ్రుతేరాహ– మహద్యశ ఇతి. మహతాం యశో మహద్యశః. భూతం సిద్ధం న తు సాధ్యమ్.

**అనువాదం :** 'దానిపేరు గొప్ప యశస్సు' అని వేదవాక్యము. కనుక మహద్యశః అని ఆత్మకు పేరు. 'గొప్ప వారియొక్క యశస్సు' అని అర్థం. గొప్ప భూతము అని మరొకపేరు. 'భూతం' అనగా జరిగిపోయినది అనగా సిద్ధమయి యున్నది అని అర్థము. 'సాధ్యము' కాదని అర్థము.

**వివరణ :** 'సిద్ధము' అనగా మన ప్రయత్నంతో పనిలేకుండా తయారయిన వస్తువు. సాధ్యము అనగా మనం ప్రయత్నంతో తయారుచేసేది. చెట్టు సిద్ధవస్తువు. చెక్క సిద్ధ వస్తువు. దాంతో చేసే బల్ల' సాధ్యవస్తువు. 'ఆత్మ' సిద్ధవస్తువు. ఒకరు చేసేది కాదు.

**శ్లో॥ మహత్ప్రజా మహల్లాభో మహదర్థో మహద్బలమ్।**
**మహద్రూపం మహచ్ఛాస్త్రం మహద్వంశో మహద్గుణః॥ 59**

మహతాం ప్రజాసన్తతిర్మహత్ప్రజా. ఏవమన్యదపి బోధ్యమ్.

**అనువాదం :** మహాత్ముల యొక్క సంతానం కనుక 'మహత్ప్రజా' అనిపేరు. మిగిలినవియు ఇట్లే.

**వివరణ :** జన్మలను బట్టి గొప్పవారి సంతానంగా, గొప్పవారికి లాభంగా–ఇలా ఆత్మ శరీరధారియై ప్రవర్తించును కనుక ఈ నామములు సమన్వయించును. తరువాత నామాలు గూడా ఇట్టివే. ఇదేరకంగా సమన్వయం చేయవచ్చును. 62వ శ్లోకంతో సహా ఇదే సమన్వయం చేయవలయును.

పూర్తిగా ఇచ్చును కనుక అజ్ఞానము పాతాళము. ఆత్మ 'అజ్ఞాన స్థానం'. అదే సంసార కూపమున పడవేస్తుంది, కనుక ఈ పేరు.

**వివరణ :** ఇందులో సమస్త లోకములు స్వరూపమే అని ప్రతిపాదింపబడినది. ఆ ప్రతిపాదన శ్లేషముఖంగా అర్థ భేదంతో చేయబడినది. తరువాత శ్లోకాలలో గూడా ఇదే స్థితి కొనసాగుతున్నది. అయితే శ్లేష లేదు.

**శ్లో॥ గోలోకః పితృలోకశ్చ సూర్యలోకోఽగ్నిధామ చ।**
**చన్ద్రలోకశ్చేన్ద్రలోకో దేవలోకో యమాలయః॥ 56**

గౌస్స్వర్గమానన్ద ఇతి యావత్. పితృసూర్యాగ్ని చన్ద్రేన్ద్రదేవయమశబ్దానా మీశ్వరవాచిత్వస్యోక్తత్వాత్తల్లోకా అపి తద్వాచిన ఏవ.

**అనువాదం :** గో అనగా స్వర్గం అనగా ఆనందం. ఆనంద స్థానం ఆత్మ కనుక 'గోలోకః' అని పేరు. పితృ, సూర్య, అగ్ని, చంద్ర, ఇంద్ర, దేవ, యమ శబ్దములు ఈశ్వర వాచకములు కనుక ఆయా లోకములు అన్ని ఆత్మనామములే.

**శ్లో॥ త్రైలోక్యమ్పరలోకశ్చేహలోకః కామ్యలోకకః।**
**సర్వలోకస్సర్వశబ్దవేద్యస్సప్తాన్నకల్పకః॥ 57**

త్రయో లోకాస్త్రైలోక్యమ్. సత్తా జ్ఞానమానన్దశ్చేతి ధర్మత్రయమ్. ఇహహృది లోక్యత ఇతి ఇహలోకః. భక్తకామ్యత్వాదస్య కామ్యలోకత్వమ్. సర్వ ఇతి బ్రహ్మనామ. 'సర్వం ఖల్విదం బ్ర' హ్మేతి శ్రుతేః. అపరిచ్ఛిన్నత్వేన బ్రహ్మణ ఏవ సర్వత్వాత్తదన్యస్య పరిచ్ఛిన్నత్వేనాల్పత్వాదసర్వత్వాచ్చ. సర్వశ్చాసౌ లోకస్సర్వలోకః. సప్తాన్నాని వ్రీహ్యాదికం హుతం ప్రహుతం పయః ప్రాణో మనోవాక్చ తేషాం కల్పక స్స్రష్టా.

**అనువాదం :** త్రైలోక్యరూపుడు అనగా 3 లోకములు అనగా సత్త, జ్ఞానము, ఆనందము అను '3' ధర్మములు స్వరూపముగా గలవాడు, ఇహ అనగా హృదయమునందు గమనింపబడువాడు కనుక ఇహలోకుడు. భక్తులకు కామ్యుడు అనగా కోరదగినవాడు కనుక కామ్యలోకుడు. 'సర్వం బ్రహ్మం' అని వేదం చెప్పుట వలన సర్వలోకుడు. బ్రహ్మము అఖండము అనగా



లేకుండగా ఉన్నది కనుక వానికన్న బంగారము భిన్నమయినది. అట్లే ప్రపంచం అంతా బ్రహ్మయందేర్పడిన మిథ్యా వికారమే. కనుక తత్త్వరీత్యా అది 'ఆత్మయే' నామరూప వికారములకన్న భిన్నం అయినది ఆత్మయే.

**శ్లో॥ శబ్దైకవేద్యో వాగ్దూరో హృద్వేద్యోహృదయాతిగః।**
**పరిచ్ఛేద్యోఽపరిచ్ఛేద్యో దూరస్థశ్చాన్తికస్థితః॥ 20**

శబ్ద ఆగమప్రమాణః. తదేక వేద్యశ్శాస్త్రయోనిత్వాత్. వాగ్దూరః 'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ' ఇతి శ్రుతే. హృద్వేద్యం 'మనసైవానుద్రష్టవ్య' మితి శ్రుతేః. పరిచ్ఛేద్యః మాయయా. వస్తుతస్త్వ పరిచ్ఛేద్యః. దూరస్థోఽ విదుషామన్తికస్థితః పణ్డితానామ్. 'దూరస్థం చాన్తికే చ త' దితి శ్రుతేః.

**అనువాదం :** 'శబ్దం' అంటే శ్రుతి. స్మృతి పురాణ ఆగమతంత్రాదులు అవి ఈశ్వర, ముని, గురుప్రోక్తాలు. అలాగే వేదాంతశాస్త్రం మున్నగునవి. ఇవి ఆత్మతత్త్వాన్ని తెలుపుతాయి. కనుక 'ఆత్మ' శబ్దైకవేద్యం. అయినా వాగ్దూరం ఆత్మ. వాక్కులకు అందనిది. 'వాక్కులు, మనస్సును పరమాత్మను చేరలేక వెనుదిరుగును' అని శ్రుతి. అది హృదయంతో తెలిసికొనదగినది. కనుక 'హృద్వేద్యం'. 'మనస్సుతోనే తెలిసికొనదగినది' అని శ్రుతి. మాయవలన భగవంతునకు మన దృష్టిలో పరిమితులు ఏర్పడినవి. నిజానికి పరిమితులు పరిచ్ఛేదాలు లేనివాడు ఆత్మ. అజ్ఞానులకు అది దూరంలో ఉన్నది. జ్ఞానులకు అది దగ్గఱలోనే ఉన్నది. కనుక దూరస్థం అంతికస్థం ఆత్మ.

'ఆత్మ దూరంలో ఉంది, దగ్గఱలోనూ ఉన్నది' అని శ్రుతి.

**వివరణ :** శబ్దంతో తెలియడం–తెలియబడకపోవటం అంటే ఏమి?

1) శబ్దం ఆత్మను గురించి చెప్పుతుంది. చెప్పకపోతే మనకు ఆత్మను గూర్చి ఎలా తెలుసు?. కనుక శబ్దవేద్యం.

2) శబ్దం అదే వాక్కు–ఆత్మనుగూర్చి 'అనుభవంతో' సమానంగా చెప్పలేదు. కాన 'వాగ్దూరం'

'థియరీ–ప్రాక్టికల్స్' మధ్య ఉన్న తేడా అది. శబ్దం ఆత్మను గూర్చి ఎంత చెప్పినా మనకు తెలిసినట్లే ఉంటుంది. హృదయం ద్వారా అనుభవం

వచ్చినపుడు తెలిసేది వేఱు. మామిడిపండు గురించి తెలియనివానికి తెలిసిన వాడు ఎంత చెప్పినా తెలిసేది తక్కువే. వాడినోట్లే మామిడిబద్ద పడవేస్తే తెలిసేది సంపూర్ణం.

అలానే 'దూరం-దగ్గఱ' ఏమిటి? మన జేబులో ఒక వస్తువు ఉన్నది. మనం మఱచిపోయాం. దానికోసం ఇల్లంతా వెతికాము. ఇంతకుముందు తిరిగిన చోట్లన్నీ వెతికాం. కనబడలేదు. కనుక ఆ వస్తువు అతనికి ఎంతో దూరంలో ఉన్నట్లు లెక్క. తరువాత అతను పరధ్యాసలో తన జేబులో చేయిపెట్టుకున్నాడు. ఆ వస్తువు దొరికింది. ఇప్పుడు అది దగ్గర ఉన్నట్లు లెక్క. అలానే 'ఆత్మ' తత్త్వం మనలోనే ఉన్నది. ఆ అనుభవం ఉన్నవానికి అది దగ్గఱుంది. లేనివానికి దూరపుది. అదీ విషయం.

**శ్లో॥ సౌవరః శ్రౌత్ర ఉన్నామా ప్రాతిశ్రుత్కో జితోఽజితః।**
**ఆదిగో మధ్యగశ్చాన్తగశ్చ భక్తేష్టదాయకః॥ 21**

సౌవరాదినామాన్యుపనిషత్సు ప్రసిద్ధాని. అజితః అభక్తైః. జితస్తు భక్తైః. ఆదిగః జగత ఇతి బోధ్యమ్.

**అనువాదం :** "సౌవరః" మొదలయిన నామములు ఉపనిషత్తుల యందు ప్రసిద్ధములు. అజితః=భక్తులు కానివారికి వశపడనివాడు. జితః=భక్తులయిన వారికి వశపడినవాడు.

**వివరణ :** స్వరమునుండి అనగా ఓంకారము నుండి లభించువాడు లేదా అమృతమయిన స్వర్లోకమునకు సంబంధించినవాడు. సౌవరుడు. శ్రోత్రమునకు అధిష్ఠానమయినవాడు శ్రౌత్రుడు. ఉత్=నేత్రములందు కనబడు చైతన్యము. ఇలా ఉపనిషత్తులలో సాంకేతికముగా వాడబడిన నామములు.

**శ్లో॥ గుహాహితో గహ్వరస్థః పరమవ్యోమగః పుమాన్।**
**గూఢోత్మా కేశవశ్శ్రీశో మాధవో మానదోఽమరః॥ 22**

'గుహాహితం గహ్వరేష్ఠమ్పురాణ' మితి 'పరమే వ్యోమ' న్నితి చ శ్రుతేర్గుహాహిత ఇత్యాదికముక్తమ్. గుహాదికశబ్దైర్బుద్ధిరభిధీయతే. గూఢశ్చాసావాత్మా గూఢోత్మా-పృషోదరాదిత్వాత్సాధుః. గూఢోత్మా న ప్రకాశత' ఇతి



అప్రతిహత గతిత్వాద్వైకుణ్ఠః. పదం స్థానం కమనీయా ముక్తిర్ముక్తికాన్తా. సమ్యక్సారస్సంసారః. మాయయా సర్వపురుషబన్ధకత్వాత్సర్వబన్ధనః.

**అనువాదం :** మంచిజ్ఞానము ఆత్మ స్వరూపం కనుక 'సుదర్శనం'. భోగులయిన జీవులకు 'ఆత్మ'యే నాథుడు కనుక 'భోగినాథః'. సర్వత్ర సర్వదా నిరాటంకముగా ఉండేవాడు కనుక 'వైకుంఠః'. 'పరమపదము' అనగా చరమస్థానము. ఆత్మ అట్టిదే కనుక 'పరమపదం'. ముక్తి కోరదగినది కనుక 'ముక్తి కాంతా'. మంచి సారమయిన వాడు కనుక 'సంసారః'. మాయతో సర్వ పురుషులను బంధించును గనుక 'సర్వబంధనః'.

**వివరణ :** ఇందులో విష్ణు సామగ్రిని ఆత్మపరంగా వ్యాఖ్యానించినారు. చక్రము, శేషుడు, వైకుంఠం, పరమపదము. విష్ణుపదము ఇవి సాధారణంగా విష్ణుసామగ్రీ వాచకములు. కాని నిర్వచన భేదాన్ని బట్టి ఆత్మ వాచకాలుగా అయినవి. ఆయా పదార్థాలన్నీ ఆత్మ రూపాలే అనడం శబ్దశక్తి మూలమయిన వ్యంగ్యం.

**శ్లో॥ ద్యులోకో బ్రహ్మలోకశ్చ ధ్రువలోకో హరేఃపదమ్।**
**భోగిలోకో బలిస్థానం స్వర్గః పాతాల ఏవ చ ॥ 55**

తేజోలోక ఇతి ద్యులోకః. బ్రహ్మైవ లోకో బ్రహ్మలోకః. ధ్రువశ్చాసౌ లోకో ధ్రువలోకః. భోగినాముక్తిః కాన్తేవ భోగినాం లోకో భోగిలోకః. బలం జగద్విధరణసామర్థ్యం అస్యాస్తీతి బలి, తచ్చ తత్స్థానం బలిస్థానమ్. స్వర్గస్సుఖం. పాతాలః పాతఃపతనమ్ సంసారకూపే ఆసమన్తాల్లాతి దదాతీత్యజ్ఞానమితి పాతాలః.

**అనువాదం :** ద్యు అనగా తేజస్సు. తేజోలోకం కనుక 'ద్యులోకః' అని ఆత్మకు పేరు. బ్రహ్మయే లోకము కనుక బ్రహ్మలోకము. శాశ్వతమయిన లోకము కనుక ధ్రువలోకము. భోగులకు కాంతవలె జీవులకు ముక్తిగా భోగస్థానం కనుక 'భోగిలోకః' అని పేరు. జగత్తును ధరించు సామర్థ్యం బలం. అట్టి బలం కలవాడు బలి. అటువంటి స్థానం కనుక ఆత్మ 'బలస్థానం'. స్వర్గం అనగా సుఖము. పాతము అనగా పతనము. సంసార కూపము పతనమును

**వివరణ :** ఆత్మయే సర్వకర్మఫలస్థానం. సర్వకర్మఫలప్రదం. సర్వకర్మఫలమయిన జ్ఞానమునకు గూడా ఆత్మయే గమ్యము. 'ఆత్మ' నుండియే ప్రపంచము, పురుషార్థములు వచ్చినవి. ఆత్మ కన్న 'విముక్త' పదార్థం క్లేశరహిత పదార్థం లేదు అని భావము.

**శ్లో॥ త్రివేణీసంగమః కాశీ ప్రయాగో మఙ్గలాచలః।**
**భద్రాద్రిశ్చాపి రామేశశ్శీతాద్రిః కాఞ్చనాచలః॥ 53**

ఇడా పిఙ్గళా సుషుమ్నాఖ్యవేణీత్రయసఙ్గమభూమిత్వా త్రివేణీసంగమః. కాశత ఇతి కాశీ. ప్రకృష్టో యాగో యజనం యస్య స ప్రయాగః. మఙ్గలాచలః మఙ్గలరాశిః ఏవం భద్రాద్రిః. రామో రమయితా స చాసావీశో రామేశః సంసారతాపవారకత్వాచ్ఛీతాద్రిః. తేజోమయత్వాత్కాఞ్చనాచలః.

**అనువాదం :** త్రివేణి అనగా 'ఇడ, పింగళ, సుషుమ్న' అను 3 నాడుల సంగమభూమి అయినవాడు కనుక 'త్రివేణీసంగమః' అనవచ్చును. ప్రకాశించును కనుక 'కాశి' అనబడును. గొప్ప యజ్ఞములు గలవాడు కనుక 'ప్రయాగః' అనవచ్చును. మంగళము రాశి కనుక 'మంగళాచలః' అనవచ్చును. భద్రములకు అద్రి కనుక 'భద్రాద్రి' అనవచ్చును. రమింపజేయు అనగా పరమసుఖం గలిగించు ఈశ్వరుడు కనుక 'రామేశః'. సంసార తాపమును పోగొట్టువాడు కనుక 'శీతాద్రిః' కాంతిమయుడు కనుక కాంచనాచలః

**వివరణ :** సర్వం ఆత్మ స్వరూపం అని సిద్ధాంతము. అందుచే 'సర్వం'లో ఉన్న నామములన్నీ ఆత్మకే చెందును. వాస్తవముగా అవి ఆత్మకే చెందునట్లు పద వ్యాఖ్యానము ద్వారా సాధించడం ఈ నామాల్లోని విశిష్టత. అంతేగాక 'ఆత్మ'కు పుణ్యక్షేత్రము, తీర్థరాజము అని గత శ్లోకంలో చెప్పిన పేర్లను ఇచ్చట వ్యాఖ్యానించినట్లయినది. అందులో 'మంగళగిరి, భద్రాద్రి' రావటం రామారావుగారి 'ఆంధ్రత్వం' కారణంగా జరిగిన చమత్కారం.

**శ్లో॥ సుదర్శనం భోగినాథో వైకుణ్ఠః పరమమ్పదమ్।**
**విష్ణోఃపదం ముక్తికాన్తా సంసారస్సర్వబనః॥ 54**

శోభనజ్ఞానం సుదర్శనం భోగినాం జీవానాం నాథో భోగినాథః.



శ్రుతేః. 'క ఇతి బ్రహ్మణో నామ ఈశో౽హం సర్వదేహినామ్, ఆవాన్తవాఙ్గే సమ్భూతౌ తస్మాత్కేశవనామవాన్' ఇతి స్మృతేః కేశవః శ్రీర్మా చ మాయా. మానదః భక్తానాం మానఖణ్డనో–భక్తానామితి వా.

**అనువాదం :** గుహాహితుడు 'గుహ' అనగా బుద్ధి హృదయము మొ॥ సంకేతము. ఇటువంటి గుహయందు ఉన్నవాడు ఆత్మ. "గుహయందు ఉన్నవాడు గహ్వరము నందు నిలిచినవాడు, ప్రాచీనుడు" అని శ్రుతి. "పరమాకాశము నందున్న వాడు" అని మఱొక శ్రుతి.

'గూఢోత్మా' అనగా నిగూఢముగా ఉన్న ఆత్మ పదార్థము. గూఢాత్మా అని ఉండాలి. కాని పృషోదరాదిగణంలో ఈ పదం 'గూఢోత్మా' అనే పఠింపబడింది. అందువలన ఈ రూపం వ్యాకరణబద్ధమే. 'గూఢోత్మ ప్రకాశింపదు' అని శ్రుతి.

కేశవుడని మఱొక పేరు. 'క' అనగా బ్రహ్మకు పేరు. ఈశుడు అనగా శివుడు సర్వ దేవతలకు ఈశుడు. వీరిద్దఱు 'ఆత్మ' నుండి పుట్టిన వారు కనుక ఆత్మకు 'కేశవః' అని పేరు. అని స్మృతి.

మా అనగా మాయ అని ఒక అర్థం. లక్ష్మి అని మఱొక అర్థం. అట్టి 'మా'కు పతి గనుక 'మాధవుడు' అని ఆత్మకు పేరు. భక్తుల మానములను ఇచ్చువాడు, లేదా అభక్తుల మానములను ఖండించువాడు కనుక 'మానదుడు' అని పేరు.

**శ్లో॥ గాయత్రీ సవితా సూర్యశ్చాంద్రస్సౌరో బుధో విధుః।**
**సావిత్రీ పరమో యజ్ఞో యష్టవ్యో యజ్ఞకృద్విధిః॥ 23**

గాయన్తం త్రాయత ఇతి గాయత్రీ చితి పరత్వాత్తత్వమ్. సవితా జనయితా సూర్యః ప్రేరకః. చాన్ద్రశ్చన్ద్రమణ్డలస్థః. సౌరస్సూర్యమణ్డలస్థః బుధః ప్రాజ్ఞః. విదధాతి సర్వమితి విధుః. సావిత్రీ జనయిత్రీ 'యజ్ఞోవైవిష్ణు' రితి శ్రుతే ర్యజ్ఞః. పరఉత్కృష్టో మా న విద్యతే యస్మాత్స పరమః.

**అనువాదం :** గానం చేయువానిని రక్షించును కనుక గాయత్రి. ఈమె జ్ఞానశక్తి. అందువలన 'ఆత్మ'కు గాయత్రి అని పేరు. సవితా=పుట్టించువాడు.

సూర్యుడు=ప్రేరణ చేయువాడు. చంద్రమండల మధ్యంలో ఉండుట వలన ఆత్మకు 'చాంద్రః' అని పేరు. సూర్యమండలము నందుండుట వలన సౌరః అని పేరు. జీవునకు ప్రాజ్ఞదశ ఉన్నది కనుక 'బుధః' అని పేరు. పుట్టించు శక్తి కనుక 'సావిత్రీ' అని పేరు. పరమయిన అనగా 'ఆత్మ' కన్న అధికమయిన వాడు ఎవడున్ను లేడు కనుక 'పరమః' అని పేరు.

**వివరణ :** జీవులు '3' రకాలు. విశ్వుడు, తైజసుడు. ప్రాజ్ఞుడు. ఇందులో సుషుప్తిలో లేదా సమాధిలో 'ఆనందం' అనుభవించేదశలో జీవుడు 'ప్రాజ్ఞుడు'. అతడు ఎంతోకొంత తన స్వరూపాన్ని గ్రహించి ఆనందరూపుడై సుషుప్తిలో ఉంటాడు. కనుక ఆనంద స్వరూప జ్ఞానం కలవాడు కనుక 'ప్రాజ్ఞుడు' అని పేరు. దానినే ఇందులో 'బుధః' అని చెప్పారు. చంద్ర, సూర్య మండలాల యందు జీవుడు ఉండడం అనేది ఉపనిషత్ప్రసిద్ధం.

**శ్లో॥ వేదార్థో వేదకృద్వేదో వేదమూర్ధకరస్సురః।**
**వేదవిద్వేదదూరశ్చ వేదవేద్యో మహామతిః॥ 24**

'వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవ చాహ' మితి గీతాత్రానుసన్ధేయా. వేదో జ్ఞానమ్. ఋగాదిర్వా. వేదమూర్ధానో వేదాన్తాః సుష్ఠు రాతి దత్తే ఆదత్తే వా సర్వమితి సురః.

**అనువాదం :** 'వేదములన్నింటికి అర్థము నేనే, వేదాంత నిర్మాత నేనే, వేదభావం తెలిసిన వాడను నేనే' అని గీతలో చెప్పినందువలన పరమాత్మకు 'వేదార్థము' 'వేదకృత్' అని పేర్లు. వేదం అంటే జ్ఞానము అని అర్థం. ఋగ్వేదము మొ॥ వేదములు గూడా. వేదమూర్ధ అంటే వేదాంతములు అనగా ఉపనిషత్తులు. సురః అంటే సమస్తమును చక్కగా గ్రహించువాడు అని అర్థము.

**శ్లో॥ ఋక్సామగేష్ణో నిర్మూలో జగదశ్వత్థమూలకః।**
**స్మారకోఽపోహకశ్చాపి జ్ఞాపకో ముక్తిదః ప్రభుః॥ 25**

గేష్ణా పర్వణీ. నిర్మూలః మూలమస్య నాస్తి. 'మత్తస్స్మృతిర్జ్ఞాన మపోహన' ఞ్చేతి శాస్త్రాత్స్మారక ఇత్యాది.

**అనువాదం :** గేష్ణములు అనగా పర్వములు అనగా కణుపులు. నిర్మూలః,



ఉన్నది కనుక 'భూః'. జ అనగా పుట్టును (జగత్తు), ల అనగా దేనియందు లీనమగునో ఆ బ్రహ్మము. 'జలం' అనబడును. లేదా జలము బ్రహ్మము. శాంతుడై బ్రహ్మము జలమని ఉపాసన చేయవలయును అని శ్రుతి. దీనివలన సమస్తము జీవించును. కనుక 'జీవనము'. దీనియందు సమస్తము ప్రభవించును కనుక 'భువనము'. భూతములనే వృక్షములకు ఆశ్రయం కనుక 'వనం' అని పేరు.

**వివరణ :** సహస్రనామాలలో లింగభేద సమన్వయం గూర్చి విష్ణుసహస్రనామ వ్యాఖ్యలో శంకరులు చెప్పిన పద్ధతిలో ఆలోచింపవలయును. పుంలింగములు విష్ణువు మొ॥ దేవతా స్వరూపములకు విశేషములు. స్త్రీలింగములు జ్ఞానశక్తికి విశేషణములు. నపుంసకములు ఆత్మకు లేదా బ్రహ్మకు విశేషణములు. ఆ ప్రకారము ఈ శ్లోకములో సర్వంసహా=స్త్రీ లింగం. జ్ఞానశక్తి (చితి) జలం మొ॥=నపుంసకం. ఆత్మ.

**శ్లో॥ పుణ్యక్షేత్రం తీర్థరాజం పాపనాశి మహోదయః।**
**మహాలయోఽర్థోదయశ్చ విష్ణుపద్యవిముక్తకమ్.॥ 52**

పుణ్యస్థానత్వాత్పుణ్యక్షేత్రమ్. ఆత్మతీర్థస్య సర్వోత్తమత్వాత్ తీర్థరాజమ్. మహాన్ప్రపఞ్చస్యోదయో యస్మాత్స మహోదయః. అర్థస్య పురుషార్థస్య ఉదయో యస్మాత్సః అర్థోదయః. విష్ణోః పరమాత్మనః పదం స్వరూపం విష్ణుపదీ. తటవత్పదశబ్దః. విశేషేణ సర్వక్లేశైర్ముక్తం విముక్తం, నవిద్యతే విముక్తం యస్మాత్తదవిముక్తమ్, తదేవావిముక్తకమ్.

**అనువాదం :** పుణ్యమునకు స్థానం కనుక పుణ్యక్షేత్రం అని పేరు. ఆత్మయే గొప్ప తీర్థస్థలము కనుక 'తీర్థరాజము'. ప్రపంచమునకు ఆత్మవలననే అభ్యుదయం కనుక ఆత్మ 'మహోదయము'. అర్థము అనగా పురుషార్థములకు ఆత్మ నుండియే ఉత్పత్తి కనుక 'అర్థోదయః' అని పేరు. పరమాత్మ అయిన విష్ణువు యొక్క స్వరూపం కనుక 'విష్ణుపదీ'. తటశబ్దము వలె పదశబ్దము స్త్రీలింగము. ప్రత్యేకం సర్వక్లేశముల నుండి విముక్తమయినది కనుక విముక్తం. దేనికన్న విముక్తము లేదో అది అవిముక్తకము.

. పఞ్చ ప్రాణా వక్త్రాణీవ యస్య స పఞ్చవక్త్రః. చత్వారో వేదా ఆస్యానీవ యస్య స చతురాస్యః. త్రయో బ్రహ్మవిష్ణురుద్రాశ్శీర్షాణీవ యస్య స త్రిశీర్షకః

**అనువాదం :** ఇతరుల నుంచి పుట్టనివాడు కనుక అనన్యజుడు. ఆనందమునకు అధిపతి కనుక 'రతిపతి'. అంటే తనయందలి ప్రీతికి తన అధిపతి. తనంతతానుగానే ప్రభవించును కనుక 'ఆత్మభూః'. భక్తులను ఆనందపఱచును కనుక 'మదనః'. 5 ఇంద్రియాలు, మనస్సు మొత్తం 6. ఇవి ముఖములుగా గలవాడు కనుక 'షడాననుడు'. 5 ప్రాణాలు ఆత్మకు 5 ముఖాల వంటివి కనుక వంచవక్త్రుడు. 4 వేదాలు ఆత్మకు నోళ్ళ వంటివి కనుక చతురాస్యుడు. బ్రహ్మ, విష్ణు, రుద్రులు శిరములవంటివారు కనుక ఆత్మ 'త్రిశీర్షకుడు'.

**శ్లో॥ హయాస్యః కమఠో బౌద్ధః కలిహన్తా వనేచరః।**
**సర్వంసహా భూర్జలం చ జీవనం భువనం వనమ్॥ 51**

హయా ఇన్ద్రియాణి ఆస్యానీవ యస్య స హయాస్యః. కే జలే సుఖే వా మఠతి నివసతీతి కమఠః. బుద్ధః ప్రాజ్ఞః. స ఏవ బౌద్ధః. కలిః పాపః తద్ధన్తా కలిహన్తా. వనే ప్రళయోదకే చరతీతి వనేచరః బ్రహ్మవనే చర ఇతి వా.సర్వమపి సహత ఇతి సర్వంసహా. చితిపరత్వాత్ స్త్రీత్వమ్. భవతీతి భూః. సంజాయతే లీయతే యత్ర జగత్తజ్జలముచ్యత ఇతి స్మరణాత్. 'జలం బ్రహ్మ 'తజ్జలానితి శాన్త ఉపాసీ' తేతి శ్రుతేశ్చ. జీవత్యనేన సర్వమితి జీవనమ్. భవతి సర్వమస్మిన్నితి భువనమ్. భూతవృక్షాశ్రయత్వాద్వనం బ్రహ్మ.

**అనువాదం :** హయములు అనగా ఇంద్రియములు ఆత్మకు ముఖములవంటివి కనుక హయాస్యుడు. 'కం' అనగా సుఖం లేదా జలము. దానియందు నివసించును కనుక 'కమఠః' అని పేరు. బుద్ధః అనగా ప్రాజ్ఞుడు కనుక బౌద్ధుడు. 'కలి' అనగా పాపము. దానిని నశింపజేయువాడు 'కలిహంత'. వనము అనగా నీరు. ప్రళయ సముద్రము. దానియందు చరించును కనుక వనేచరః. బ్రహ్మ వనము నందు చరించును కనుక 'వనేచరః' అనియు అనవచ్చును. సర్వమును సహించును కనుక 'సర్వంసహ' అనవచ్చును. ఇందులో స్త్రీలింగము జ్ఞానశక్తి అయిన 'చితి' అనే ఉద్దేశంతో వాడబడినది.



అనగా మూలము లేనివాడు. స్మారకః అనగా స్మృతి కలిగించువాడు జ్ఞానదాత. 'నా వలననే స్మరణము జ్ఞానం, అపోహలు అనగా రకరకాల ఊహలు' అని గీత చెప్పినది.

**శ్లో॥ అత్తా కాలో యమో మృత్యుస్సేతుస్సేతుకృదర్థకృత్।**
**వైశ్వానరో విశ్వరూపస్సహస్రాక్షస్సహస్రపాత్॥ 26**

అత్తా చరాచరగ్రహణాదితి సూత్రాదత్తా భక్షితా. కలయతీతి కాలః. యమయతీతి యమః. సర్వాన్తకారిత్వాన్మృత్యుః. 'సహస్ర శీర్షాపురుష స్సహస్రాక్ష స్సహస్రపా' దితి శ్రుతేరాహ సహస్రాక్ష ఇత్యాది.

**అనువాదం :** 'చరమయిన జీవ ప్రపంచమును, ఆచరమయిన వృక్ష పర్వతాదులను గ్రహించును గనుక 'అత్త' అని బ్రహ్మ సూత్రము వలన 'ఆత్మ' అత్త. అనగా తినివేయునది. అన్నింటిని పొందును, గమనించును కనుక, 'కాలం'. నియమించును గనుక యమః. సమస్తమును అంతము చేయును కనుక 'మృత్యువు'. 'వేయితలలు గలవాడు వేయి నేత్రములు గలవాడు వేయి పాదములు గలవాడు పురుషుడు'–అని శ్రుతి. అందువలన ఆత్మ 'సహస్రాక్షః సహస్రపాత్' అని పిలువబడును.

**శ్లో॥ సహస్రశీర్షో శుభహృచ్ఛఙ్కరశ్శమ్భురార్తిహృత్।**
**విశ్వోపజీవ్యో విశ్వైకపాదోఽ పాదశ్చతుష్కలః॥ 27**

శం కరోతీతి శంకరః. శమస్మాద్భవతీతి శమ్భుః. 'విశ్వాక్షం విశ్వశమ్భువమ్, తద్విశ్వముపజీవ' తీత్యాది శ్రుతేః. విశ్వైకపాదః, 'పాదోస్య విశ్వా భూతా' నీతి శ్రుతేః.

**అనువాదం :** శం అనగా శుభమును కలిగించును కనుక 'శంకరః'. ఆయన వలన శుభము కలుగును కనుక 'శంభుః'. విశ్వమే నేత్రములుగా గలవాడు, విశ్వమునకు మంగళకరుడు విశ్వమును బ్రతికించువాడు' అని శ్రుతి. విశ్వమంతయు ఒక పాదముగా గలవాడు ఆత్మ. 'సమస్త భూతములు భగవంతునిలో 4వ వంతు' అని శ్రుతి.

**శ్లో॥ షోడశాత్మా లిఙ్గతనుర్మాయోపాధిర్మరుత్పతిః।**
**హిరణ్యగర్భస్సూత్రాత్మా చేతనోఽ చేతనోద్భవః॥ 28**

'షోడశకలః పురుష' ఇతి శ్రుతేః షోడశాత్మా మరుతో దేవాశ్చేతనశ్చేతయితా. అచేతనానాముద్భవో యస్మాత్సః. అచేతనోద్భవః.

**అనువాదం :** "16 కలలు గలవాడు జీవుడు' అని శ్రుతి. కనుక షోడశాత్మా అని పేరు. మరుత్తులు అంటే దేవతలు. మరుత్పతి అనగా దేవదేవుడని అర్థం. చేతనః=జ్ఞానం కలిగించువాడు. అచేతనములయిన అనగా జడమయిన పదార్థములు ఈయన నుంచి పుట్టును కనుక 'అచేతనోద్భవః' అందురు.

**శ్లో॥ చతుశ్శృఙ్గస్త్రిపాదశ్చ ద్విశీర్ష స్సప్తహస్తకః।**
**త్రిధాబద్ధశ్చ ఋషభో ముఖరో ముఖ్యఉన్నతః॥ 29**

'చత్వారిశృఙ్గాః త్రయో అస్య పాదా' ఇత్యాది మన్త్రమవలంబ్యాహ చతుశ్శృఙ్గ ఇత్యాది. చత్వారః విశ్వతైజసప్రాజ్ఞతుర్యాః విరాడ్ఢిరణ్యగర్భావ్యాకృత బ్రహ్మాణి వా, శృఙ్గాణి యస్య సః. త్రయో విశ్వాదయః పాదా యస్య, ద్వే శీర్షే జీవేశ్వరౌ యస్య స ద్విశీర్షః. సప్త ఇన్ద్రియపఞ్చకం, మనోబుద్ధిశ్చ, హస్తా యస్య స సప్తహస్తః. త్రిధా సత్త్వరజస్తమోగుణైర్బద్ధ ఇవ స్థితస్త్రిధా బద్ధః గుణత్రయచ్ఛన్న ఇత్యర్థః. ఋషభశ్శ్రేష్ఠః. ముఖరశ్శబ్దాయమానః. ముఖమాది-స్తత్రభవో ముఖ్యః

**అనువాదం :** '4 కొమ్ములు, 3 పాదములు' అను వేదమంత్రము ప్రకారము ఆత్మ 'చతుశ్శృంగః' అని పిలువబడును. ఆ 4 కొమ్ములు 4 రకాల ఆత్మ భేదములు. విశ్వాత్మ తైజసాత్మ ప్రాజ్ఞాత్మ తుర్యాత్మ-(ఇవి వ్యష్టిగా ఉండే ఆత్మలు) లేదా విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృత, బ్రహ్మలు. (ఇవి సమష్టి ఆత్మలు). విశ్వ మొ॥ 3 పాదములు గలది ఆత్మ. జీవుడు ఈశ్వరుడు అను 2 తలలు గలది ఆత్మ. 5 ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, అను '7' హస్తములు గలది కనుక సప్తహస్తం ఆత్మ. 3 గుణములు అనగా సత్వ రజస్తమోగుణముల చేత బద్ధమైనది కనుక త్రిధాబద్ధము. ఋషభః అనగా శ్రేష్ఠం అయినది. ముఖరః ధ్వని కలది, ముఖ్యః=ముఖం అనగా ఆదికాలము. ఆకాలమున నున్నది కనుక ముఖ్యము.



సమస్త దేహములలో 'ఆత్మ' ఉన్నంతవరకు మంగళకరం. ఆత్మలేని దేహములు శవములు, అమంగళములు. ఎంత అందమయినా శవాన్ని నిరాకరించి తీరుతాం. కనుక సర్వదేహ మంగళకరం. ఆత్మ.

గ్రహములు అంటే గ్రహించేవి. అనగా నేత్రశక్తి రూపాన్ని గ్రహిస్తుంది. అలానే మనస్సులో పుట్టే రకరకాల జ్ఞానాలు గ్రహాలు. వాటికి ప్రభువు కనుక గ్రహరాట్. ఆత్మ లేనిదే జ్ఞానాలు పుట్టవు. పుట్టినా ఆత్మ స్వీకరింపనిదే వ్యర్థం. చక్రములు అనగా శరీరమునందుండే చక్రములు. వానియందు ఆత్మ రకరకాలుగా మజిలీలు చేయును కనుక చక్రవర్తి.

**శ్లో॥ ప్రజాపతిర్నారదశ్చ దక్షశ్చ శ్రవణప్రియః।**
**రాజరాజో ముకున్దశ్చ నిధిర్హృదయసమ్భవః॥ 49**

ప్రజానామ్పతిః ప్రజాపతిః. నారం జ్ఞానం దదాతీతి నారదః. దక్షస్సమర్థః . శ్రవణప్రియః శ్రోత్రానన్దకరః రాజ్ఞాం బ్రహ్మాదీనామపి రాజారఞ్జకః రాజరాజః . ముకుమ్మోక్షం దదాతీతి ముకున్దః. నిధీయతే భక్తైర్హృదయే ఇతి నిధిః. హృదయే భక్తానాం సమ్యగ్భవతి స్ఫురతీతి హృదయసమ్భవః.

**అనువాదం :** ప్రజలకు పతి కనుక ప్రజాపతి. నారము అనగా జ్ఞానమును ఇచ్చువాడు కనుక 'నారదః' అని పేరు. దక్షః అనగా సమర్థుడు. శ్రవణప్రియః అనగా చెవులకు ఆనందం కలిగించేవాడు. రాజులకు అనగా బ్రహ్మ విష్ణువు మొ॥ లోకాధిపతులకు ఆనందకరమయిన వాడు కనుక 'రాజరాజః' అని పేరు. ముకుం అనగా మోక్షమును ఇచ్చును కనుక ముకుందుడు. భక్తులు తమ హృదయాలయందు నిలుపుకొనెదరు కనుక 'నిధి' అని పేరు. భక్తుల హృదయమున చక్కగా స్ఫురించును కనుక హృదయసంభవుడు అని పేరు.

**శ్లో॥ అనన్యజో రతిపతిశ్చాత్మభూర్మదనోపి చ।**
**షడాననః పఞ్చవక్త్రశ్చతురాస్య స్త్రిశీర్షకః॥ 50**

అన్యస్మాజ్జాయత ఇతి అన్యజః, స న భవతీత్యనన్యజః. రతిః ప్రీతిః తత్పతిరాత్మవిషయప్రీతిరాత్మపతికత్వాత్ ఆత్మనైవ భవతీత్యాత్మభూః. మదయతి భక్తానితి మదనః. షట్ ఇన్ద్రియపఞ్చకమ్మనశ్చేత్యాననాని యస్య స షడాననః

'మృత్యుంజయుడు'. అజ్ఞానులకు భగవంతుడు ఉగ్రుడు. భయంకరుడు. విద్వాంసులకు శాంతుడు, భయం లేనివాడు. అర్జునః=తెల్లనివాడు. దేవతలు అనగా ప్రాణాది దేవతలతో కలసి తిరుగువాడు సహదేవుడు. కులము లేని వాడు నకులుడు (న=అనునది నఞ్ అను అర్థము గల ఒక ప్రత్యయము) జగత్తును ధరించు అధిక సామర్థ్యం గలవాడు కనుక 'బృహద్బలః' అని పేరు.

**శ్లో॥ ధృతరాష్ట్రశ్చ రుద్రశ్చ భూతేశ స్సర్వమఙ్గలః।**
**చక్రవర్తీ చక్రధరో గ్రహరాడ్ లోకబాన్ధవః॥ 48**

ధృతం రాష్ట్రం జగద్యేన స ధృతరాష్ట్రః. రోదయతీతి రుద్రః. భూతానాం ప్రాణినామీశో భూతేశః. సర్వేషాం దేహాదీనాం మఙ్గలం శుభం పవిత్రత్వమితి యావత్. యస్మాత్స సర్వమంగలః సర్వస్మాదపి మంగల ఇతి వా. చక్రే జగన్మణ్డలే వర్తత ఇతి చక్రవర్తీ. చక్రం జగద్భరతీతి చక్రధరః. గ్రహా జ్ఞానాని తేషాం రాట్ గ్రహరాట్. బన్ధురేవబాన్ధవః బన్ధువదనుగ్రాహకః. ఇన్ద్రియాది ప్రవర్తకత్వాత్.

**అనువాదం :** రాష్ట్రము అనగా ప్రపంచము. దానిని ధరించియుంచినవాడు కనుక ధృతరాష్ట్రుడు. ఏడిపించును కనుక రుద్రుడు. భూతములు అనగా ప్రాణులకు ఈశుడు, కనుక భూతేశుడు. సర్వదేహములకు మంగళమయిన వాడు అనగా శుభమయిన పవిత్రం అయినవాడు అని అర్థము. లేదా అందఱికన్న మంగళమయిన వాడని అర్థము. చక్రము నందు అనగా ప్రపంచచక్రమునందు వర్తించువాడు కనుక చక్రవర్తి. లేదా చక్రము అనగా ప్రపంచమును భరించును కనుక చక్రవర్తి. గ్రహములు అనగా జ్ఞానములు వానికి ప్రభువు కనుక గ్రహరాట్. బంధువు వలె లోకమును అనుగ్రహించును. కనుక లోకబాంధవుడు. ఇంద్రియాదులను సక్రమముగా నడిపించి లోకమునకు మేలు చేయును గదా!

**వివరణ :** రాష్ట్రము అంటే ప్రపంచము, అలానే శరీరము. ఆత్మ శరీరాన్ని నిలుపును కనుక ధృతరాష్ట్రుడు. శరీరాలను విడవడం ద్వారా ఏడిపిస్తున్నది కనుక లేదా 'లయ' కార్యక్రమము వలన ఏడిపించును కనుక రుద్రుడు.



**శ్లో॥ ఆదిత్యవర్ణో విరజా ఇదన్ద్రశ్చేన్ధ ఆయతః।**
**గోవిన్దో నరసింహశ్చ క్షరాక్షరవిలక్షణః॥ 30**

తేజోమయత్వాదాదిత్యవర్ణః 'ఆదిత్యవర్ణం తమసః పరస్తా' దితి శ్రుతేః ఇదం పశ్యతీతీదన్ద్రః. ఇన్ధే దీప్యత ఇతి ఇన్ధః. 'ఇదన్ద్రం సన్తమిన్ద్ర ఇత్యాచక్షతే పరోక్షప్రియా ఇవ హి దేవాః, 'ఇన్ధం సన్తమిన్ద్రమిత్యాచక్షతే' ఇతి శ్రుతిభ్యామ్ గావౌ ద్యావాభూమీ విన్దత ఇతి గోవిన్దః. నరా జీవాన్తేషాం సింహ ఇవ శ్రేష్ఠః నరసింహః 'క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే, ఉత్తమః పురుష స్త్వన్య' ఇతి గీతావచనాదాహ–క్షరేతి.

**అనువాదం :** తేజోమయుడు అగుట వలన ఆదిత్యవర్ణుడు. 'చీకటికి అవతల ఆదిత్యసమంగా వెలుగువాడు' అని శ్రుతి. ఇదంద్రః అనగా ఇదం=దీనిని పశ్యతి=చూచును కనుక 'ఇదంద్రః' అని ఒక పేరు. ఇంధే =వెలుగును కనుక 'ఇంధః' అని మఱొకపేరు. 'ఇదంద్రుడే ఇంద్రుడని పిలువబడును' అని ఒక శ్రుతి. ఇంధుడే ఇంద్రుడు అని పిలువబడును. దేవతలు పరోక్షప్రియులు గదా! అని మఱొక శ్రుతి. గోవులు అనగా భూమ్యాకాశములను పొందును కనుక గోవిందుడు అని పేరు. నరులు అనగా జీవులు. వారిలో సింహము వలె శ్రేష్టుడయినవాడు కనుక నరసింహుడు. క్షరం అనగా సమస్త భూతములు. కూటస్థుడు అక్షర పురుషుడు. తద్భిన్నుడు ఉత్తమ పురుషుడు అని గీత చెప్పినది. అందువలన పరమాత్మ 'క్షరాక్షర విలక్షణుడు'

**వివరణ :** దేవతలు పరోక్షప్రియులు. అనగా 'గోప్యం'గా వుంటారు. తమ స్వభావము ప్రభావము వారు డంబముగా ప్రదర్శించరు.క్రియల వలన మాత్రమే వారి ఉనికి తెలుస్తుంది. అందువలన వారు తమ పేర్లు గూడా తమ స్వభావానికి తగ్గట్టుగా బయటపడకుండా ఉంటారు. కనుక 'ఇదంద్ర, ఇంధ' అన్న పేర్లను కొంచెం మార్చి 'ఇంద్ర' అని పేరు పెట్టుకున్నాడు ఇంద్రుడు. పశ్యకుడు అను పేరు కలవాడు 'కశ్యపుడు' అయినాడు.

**శ్లో॥ క్షేత్రజ్ఞః క్షేత్రకృత్ క్షేత్రీ క్షేత్రభిన్నశ్శరీరభృత్।**
**సాంశో నిరంశస్సర్వాంశో మహదంశోఽఖిలాంశవిత్॥ 31**

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధీత్యాది గీతాధ్యాయాదాహ-క్షేత్రజ్ఞ ఇత్యాది. సర్వే జీవా అంశా యస్య స సర్వాంశః. 'మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతన' ఇతి గీతావచనాత్. మహదంశః మహాన్తస్సోమ సూర్యాదయః అంశా యస్య స మహదంశః. 'ఆదిత్యానామహం విష్ణు' రిత్యాది గీతావచనాత్. 'యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా, తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసమ్భవమితి గీతావచనాచ్చ యావన్తః అంశా అస్య సన్తి తావతస్సర్వా నయమేవ వేద నాన్య ఇత్యాహ-అఖిలాంశ విదితి.

**అనువాదం :** "క్షేత్రజ్ఞుడను నేను" అని గీతలో చెప్పిన శ్లోకాలను దృష్టిలో ఉంచుకొని ఈ నామములు చెప్పుచున్నాడు. సమస్త జీవులు ఎవరి అంశయో వాడు సర్వాంశుడు. గీతలో "నా అంశయే జీవలోకమున జీవుడుగా అవతరించెను" అని ఉన్నది కనుక ఈ నామము వచ్చినది. సోమసూర్యాదులు మహత్తులు. అట్టి మహత్స్వరూపులు గూడ ఆత్మయొక్క అంశలే కనుక ఆత్మ 'మహదంశః' అని చెప్పబడెను. 'ఆదిత్యులలో నేను విష్ణువు అను పేరు గల ఆదిత్యుడను' అను గీతావచనము ఇందుకు ప్రమాణము. "ప్రపంచంలో గొప్పకళ ఐశ్వర్యము మహిమ ఉన్నచోట్లన్నీ నా తేజస్సు వలన వచ్చినవని భావింపుము" అని గీత చెప్పినది. అందువలన పరమాత్మ యొక్క అంశములు ఏవో ఎన్నో ఆయనకు మాత్రమే తెలియును కనుక "అఖిలాంశవిత్" అని నామము.

**వివరణ :** "క్షేత్రం" అంటే శరీరము. లేదా జీవభిన్నమయిన జడప్రపంచము. దీనిని గురించి తెలిసినవాడు, దీని నిర్మాత, దీని యజమాని, వీనిలో వ్యాపించి నడపువాడు ఆత్మయే. కనుక క్షేత్రజ్ఞః మొ॥ నామములు వచ్చినవి.

**శ్లో॥ భీతికృద్భీతిహృ-చ్ఛాస్తా సుపర్ణశ్చ మదామదః।**
**దుర్జ్ఞేయో దుర్వచో దుర్గ-స్సులభశ్చ సుహృత్సఖా॥ 32**

అభక్తానాం భీతికృద్భక్తానాం భీతిహృత్. 'భీషాస్మాద్వాతః పవత' ఇత్యాది శ్రుతేః. శోభనపతనస్సుపర్ణః 'ద్వాసుపర్ణా సయుజా సఖాయా' ఇతి శ్రుతేః. మదామదః సమదోఽమదశ్చ. 'కస్తం మదామదం దేవ' మితి శ్రుతేః. దుర్గో దుర్లభః అజ్ఞానాం, సులభస్సుజ్ఞానినామ్.



**శ్లో॥ సమవర్తీ జగత్ప్రాణో నన్దనో హరిచన్దనః।**
**విద్యుద్వరేణ్యోవరదో రత్న గర్భో ధనఞ్జయః॥ 46**

సర్వత్ర సమం యథాతథా వర్తత ఇతి సమవర్తీ. యేన జగదిదం ప్రాణితి స జగత్ప్రాణః. నన్దయతీతి నన్దనః. హరయో యమానిలాదయో దేవాః తాన్ చన్ద్రయతీతి హరిచన్దనః. దుఃఖం హరతీతి హరిస్సచాసౌ చన్దనో హరిచన్దన ఇతి వా. విశేషేణ ద్యోతత ఇతి విద్యుత్. వరేణ్యశ్శ్రేష్ఠః. వరం దదాతీతి వరదః. మాయోపహితచైతన్యస్యేశ్వరత్వాన్మాయోపాధిగర్భే రత్నభూతం చైతన్యమస్తీతి రత్నగర్భ ఈశ్వరః. ధనం భక్తానాం జయతి హరతీతి ధనఞ్జయః

**అనువాదం :** అన్నింట సమంగా ఉండేవాడు 'సమవర్తి'. జగత్తుకు ప్రాణం అయినవాడు గనుక 'జగత్ప్రాణః'. ఆనందపరచును కనుక 'నందనః'. యముడు, వాయువు మొ॥ దేవతలను ఆనందపఱచును కనుక 'హరిచందనః ' లేదా దుఃఖములను హరించునట్టి ఆహ్లాదకరుడు కనుక 'హరిచందనః'. మిక్కిలిగా ప్రకాశించును కనుక 'విద్యుత్'. శ్రేష్ఠుడు కనుక వరేణ్యః, వరములను ఇచ్చువాడు కనుక వరదః, మాయలో అనగా సృష్టిలో చైతన్య రూపంగా పరమేశ్వరుడు ఇమిడి ఉన్నాడు. కనుక మాయా గర్భములో రత్నమువలె నున్నాడు కనుక 'రత్నగర్భః'. భక్తుల ధనమును హరించును కనుక 'ధనంజయుడు'.

**శ్లో॥ మృడో మృత్యుఞ్జయశ్చోగ్రశ్శాన్తో భీమో విభీషణః।**
**అర్జునస్సహదేవశ్చ నకులశ్చ బృహద్బలః॥ 47**

మృడయతి సుఖయతీతి మృడః. మృత్యుర్ధావతి పఞ్చమ ఇతి శ్రుతేర్మృత్యుఞ్జయః ఉగ్రోభీమశ్చా జ్ఞానాం, శాన్తో విభీషణశ్చ విదుషామ్ అర్జునశ్శుక్లః. దేవైః ప్రాణాదిభిస్సహ వర్తత ఇతి సహదేవః. న విద్యతే కులం యస్య సః నకులః. నఞర్థకనశబ్దః. బృహదధికం బలం జగద్ధారణసామర్థ్యం యస్య స బృహద్బలః.

**అనువాదం :** మిక్కిలి జయించును కనుక 'మృడః' అని పేరు. 'మృత్యువు గూడా భగవంతునికి భయపడి పరుగెత్తుచుండును' అని శ్రుతి కనుక

=వేదములను పుట్టించినవాడు. ఆ మహాభూతం యొక్క నిట్టూర్పులే ఈ ఋగ్వేదం మొ॥ అని శ్రుతి. పవిత్రం చేయును కనుక పావకుడు. ముందుకు తీసికొని వెళ్ళును కనుక అగ్ని. సత్పురుషులకు ఎల్లపుడు గమ్యం కనుక సదాగతి. ఆహ్లాదం కలిగించును కనుక 'చంద్రః' అమృత స్వరూపులయిన జీవులు తన కిరణములవంటి వారు కనుక 'అమృతాంశువు' శుద్ధమయిన లేదా తేజోమయమయిన జీవులే కిరణాలుగా గలవాడు కనుక 'శుభ్రాంశువు' కలలు అనగా విద్యలు, వానికి నిధి కలానిధి. నీటిని సృష్టించుట ధ్వంసము చేయుట అను '2' క్రియలకు కర్త కావున 'అపాంపతిః'.

**శ్లో॥ ప్రచేతా వరుణశ్శ్రీదశ్శుక్రో జిష్ణుర్బృహస్పతిః**
**పురుహూతస్త్రిపురధక్ దేవదేవః పురన్దరః॥ 45**

ప్రకృష్టం చేతో యస్య స ప్రచేతాః. వ్రియత ఇతి వరుణః. శ్రియం మాయాం దదాతీతి ద్యతి ఖండయతీతి వా శ్రీదః. శుచం దుఃఖం రాతిధత్తే అపహరతీతి వా శుక్రః. జిష్ణుర్జయశీలః బృహతాం వాచామ్పతిర్బృహస్పతిః పురు అంకం యాత్యాహూతః పురుహూతః. పురుభిర్మహద్భిర్హూత ఇతి వా. త్రీణి పురాణి స్థూలసూక్ష్మకారణ శరీరాణి దహతీతి త్రిపురధక్. పురం స్థూలాదికం దరతి విదారయతీతి పురన్దరః.

**అనువాదం :** గొప్ప మనస్సు కలవాడు కనుక 'ప్రచేతాః' అని పేరు. అందరిచే వరింపబడును కనుక 'వరుణః' అని పేరు. శ్రీ అనగా లక్ష్మిని ఇచ్చువాడు లేదా శ్రీ అనగా మాయను ఖండించువాడు కనుక 'శ్రీదః'. 'శుక్' దుఃఖమును తెచ్చువాడు లేదా అపహరించువాడు అను అర్థమున శుక్రుడు. బృహత్ అనగా వాక్కులకు పతి కనుక బృహస్పతి. పిలువబడినచో అనగా బాగుగా ధ్యానింపబడినచో మన ఒడిన (పురు) చేరువాడు కనుక 'పురుహూతః' లేదా పురు=గొప్పవారిచేత పిలువబడును కనుక 'పురుహూతః'. త్రిపురములను అనగా స్థూల, సూక్ష్మ కారణ శరీరములను దహించువాడు కనుక త్రిపురధక్. 'స్థూల సూక్ష్మ కారణ శరీరములు' అనబడే పురములను చీల్చువాడు కనుక 'పురందరుడు'.



**అనువాదం :** భీతికృత్=భక్తిలేని వారికి భయం కలిగించువాడు. భీతిహృత్= భక్తులయిన వారికి భయము హరించువాడు. "పరమాత్మకు భయపడియే గాలి వీచుచున్నది" అని శ్రుతి. చక్కని గమనము గలవాడు కనుక సుపర్ణుడు. "సమానస్థానము స్నేహముగల ఇద్దఱు సుపర్ణులు గలరు" అని శ్రుతి సుపర్ణ శబ్దము వాడినది. మదంగలవాడు మదం లేనివాడు కనుక మదామదుడు. 'మదామదు'డయిన ఆ దేవుని ఎవరు తెలిసికొనగలరు? అని శ్రుతి. అజ్ఞానులకు దుర్లభుడు కనుక 'దుర్గః' అని పేరు. జ్ఞానులకు సులభుడు కనుక 'సులభుడు' అని పేరు.

**వివరణ :** మదం గలవాడు ఆత్మ అంటే జీవపక్షంలో మదం. ఆత్మపక్షంలో మదం లేకపోవడం కనబడతాయి కనుక 'మదామదః' అని నామం చెప్పారు.

**శ్లో॥ కర్మాధ్యక్షః కర్మసాక్షీ నిష్కర్మా కర్మకారకః**
**ప్రజ్ఞానం జ్ఞానకరణం తత్త్వజ్ఞానఫలం వశీ॥ 33**

'ఏకో దేవ' ఇత్యాది మన్త్రవర్ణాదాహ–కర్మాధ్యక్ష ఇతి. 'ప్రజ్ఞానంబ్ర' హ్మేతి శ్రుతేరాహ–ప్రజ్ఞానమితి. 'యేనేక్షతే శృణోతీద' మిత్యాది శాస్త్రాదాహ–జ్ఞానకరణమితి.

**అనువాదం :** 'ఒకే దేవుడు సర్వభూతాధివాసుడు' మొ॥ శ్రుతిని బట్టి 'కర్మాధ్యక్షః' అను నామం వచ్చినది. 'ప్రజ్ఞానము బ్రహ్మ' అనుటవలన 'ప్రజ్ఞానము' అను నామము వచ్చినది. 'ఆత్మవలననే చూడటం, వినడం జరుగుచున్నది' అను శ్రుతి వలన 'జ్ఞానకరణం' అను నామము వచ్చినది.

**వివరణ :** సర్వభూతములయందు 'ఆత్మ' సాక్షిగా ఉన్నది కనుక సర్వకర్మలకు 'ఆత్మ'యే అధ్యక్షుడు అని భావము.

**శ్లో॥ జగద్గురు–శ్శాస్త్రయోనిః పూజ్యో వన్ద్యోఽవశో వశః**
**యోగేశ్వరో యోగఫలం యోగకృద్యోగవిద్యువా 34**

వన్ద్యస్స్తుత్యః అవశోఽభక్తానాం, వశస్తు భక్తానామ్. 'యు' మిశ్రణా మిశ్రణయోరితి ధాతుః, యౌతి మాయయా సహ మిశ్రీభవతీతి యువా. మాయాఽసక్త ఇతి వా.

**అనువాదం :** వంద్యః=స్తుతింపదగినవాడు. భక్తి లేనివారికి వశం కానివాడు. భక్తులకు వశం అయినవాడు. "యు" అనే ధాతువునకు కలియటం అని అర్థం. మాయతో కలుస్తాడు లేదా మాయయందు ఆసక్తి కలవాడు అను అర్థంలో "యువా" అని ఒకనామం.

**వివరణ :** శాస్త్రయోనిః శాస్త్రములే తనను తెలిసికొనే మార్గంగా గలవాడని అర్థం. అంటే 'ఆత్మను గూర్చి మనకు శాస్త్రములు అనగా వేదాదులు తెలుపును. లేదా సర్వశాస్త్రములకు తానే కారణం అయినవాడు. శ్రుతులు స్మృతులు తన ఆజ్ఞలని, వేదాలు భగవంతుని శ్వాసలని, వేదాలను భగవంతుడు మత్స్యాది-అవతారముల ద్వారా తిరిగి సంపాదించాడని, ప్రళయానంతరం గత కల్పంలోని వేదాలను భగవంతుడు బ్రహ్మాదులకు ఇచ్చాడని కథలు. కనుక పరమాత్మ శాస్త్రయోని. మఱియు

కర్మజ్ఞానయోగాలకు, రాజయోగానికి లయయోగానికి మంత్రయోగానికి, నాదయోగానికి హఠయోగానికి-దేనికయినా కర్త, గమ్యం పరమాత్మయే.

**శ్లో॥ ప్రతిష్ఠా సద్గతిర్బ్రహ్మ బ్రాహ్మణో బ్రహ్మవిత్తమః।**
**బ్రహ్మణ్యో బ్రాహ్మణారాధ్యో బ్రహ్మక్షత్రౌదనః పతిః॥ 35**

'బ్రహ్మపుచ్ఛమ్ప్రతి' ష్ఠేతి శ్రుతేరాహ-ప్రతిష్ఠేతి. 'బ్రహ్మవిద్బ్రహ్మైవ భవ' తీతి శ్రుతేరాహ - బ్రహ్మవిత్తమఇతి. బ్రాహ్మణాః బ్రహ్మజ్ఞానినః. బ్రహ్మ చతుర్ముఖః. 'తస్య బ్రహ్మ చ క్షత్రఞ్చ ఉభే భవత ఓదన' ఇతి శ్రుతేరాహ-బ్రహ్మక్షత్రౌదన ఇతి. పతిః పాలకః.

**అనువాదం :** బ్రహ్మకు బ్రహ్మయే ప్రతిష్ఠ-కనుక 'ప్రతిష్ఠ' అని ఒక నామము. బ్రహ్మవేత్త బ్రహ్మమే అగును. అను శ్రుతి వలన 'బ్రహ్మవిత్తమః' అని ఒక పేరు. బ్రాహ్మణులు అనగా జాతిమాత్ర బ్రాహ్మణులు అని కాక బ్రహ్మజ్ఞానము గలవారు అని అర్థం. బ్రహ్మ అనగా సృష్టికర్త అయిన చతుర్ముఖ బ్రహ్మ. 'ఆ పరమాత్మకు బ్రహ్మక్షత్రియులు ఉభయులు ఓదనమే' అను శ్రుతి వలన 'బ్రహ్మ క్షత్రౌదనః' అని పేరు. పతిః అనగా పాలకుడు.

**శ్లో॥ వినాయకో ధర్మరాజః కామజి న్మృత్యుజి త్ఖగః।**
**వాయుగోఽ నలగో వార్గో భూమిగ స్తరుగోఽ ద్రిగః॥ 36**



**శ్లో॥ అశోకః కల్పవృక్షశ్చ కామధు-క్చామృతోదధిః।**
**ఉచ్చైశ్శ్రవా భార్గవీ చైరావతశ్చ సుధాఘటః॥ 43**

నిశ్శోకత్వాదశోకః. కలయతి సర్వమితి కల్పః. వృక్ష ఇవ స్తబ్ధత్వాద్వృక్షః. కామాన్దుగ్ధే ఇతి కామధుక్. అమృతం సుఖం తస్యోదధిః, శ్రవః కీర్తిః భార్గవీ భృగువిద్యా ఉపనిషత్తద్వేద్యత్వాత్తద్వాచ్యత్వముపచారాత్ ఇరా ఆపః అస్య అయనత్వేనోత్పాద్యత్వేన వా సన్తీతి ఇరావాన్, స ఏవైరావతః. స్వార్థేఽణ్. సుధాఘటః ఆనన్దకలశ ఇవ స్థితః.

**అనువాదం :** శోకములు లేనివాడు కనుక అశోకుడు, అన్ని కల్పించినవాడు కల్పము. వృక్షమువలె స్తబ్ధమయినవాడు కనుక 'వృక్షము' వెఱసి కల్పవృక్షము, కోరికలను కలిగించువాడు తీర్చువాడు కనుక 'కామధుక్'. అమృతము అనగా సుఖము. దానికి సముద్రము వంటివాడు కనుక 'అమృతోదధి'. ఉచ్చైశ్శ్రవాః , ఉన్నతమయిన కీర్తి గలవాడు, భార్గవీ=భృగువిద్య. దానిచే తెలియబడువాడు కనుక భార్గవీ అను పేరు. ఇర అనగా నీరు (ఆ నీరు గూడా ఆయన నుంచియే సృష్టింపబడినది కనుక) గలవాడు. ఇరావాన్ అనగా నీరు గలవాడు. స్వార్థమున అనగా అదే అర్థమున 'అణ్' ప్రత్యయము. 'ఐరావతః' అని పేరు. సుధాఘటః ఆనంద ఘటమువలె ఉన్నవాడు.

**శ్లో॥ భాస్వాన్సజ్జాతవేదాశ్చ పావకోగ్నిస్సదాగతిః।**
**చన్ద్రోమృతాంశుశ్శుభ్రాంశుః కలానిధిరపామ్పతిః॥ 44**

భాస్వాన్ తేజోవాన్. భాతీతి భమ్. జాతా వేదా యస్మాత్సజాతవేదాః. 'తస్య మహతో భూతస్య నిశ్శ్వసితమేతద్యదృగ్వేద' ఇత్యాది శ్రుతేః పావయతీతి పావకః. అగ్రం నయతీత్యగ్నిః సదాపి గతిర్గమ్యః సతామితి సదాగతిః. చన్ద్రయత్యాహ్లాదయతీతి చన్ద్రః. అమృతా అమరణ ధర్మాణః అంశవః అంశుతుల్యా జీవా యస్య సః. శుభ్రాశ్శుద్ధాస్తేజో మయావా అంశవో జీవా యస్య స శుభ్రాంశుః. కలా విద్యాః అపామ్పతిస్తదుత్పాదకత్వాత్తదుప సంహారకత్వాచ్చ.

**అనువాదం :** భాస్వాన్=తేజస్సుగలవాడు. భం=ప్రకాశించువాడు, జాతవేదాః

'అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపఞ్చం ప్రపఞ్చ్యత ఇతి న్యాయాద్బ్రహ్మణి తావద్రూపప్రపఞ్చాధ్యారోపం కృత్వా, నామప్రపఞ్చాధ్యారోపం కరోతి–ఉమేత్యాదినా. యే యే శబ్దాః పార్వతీపత్యాది వాచకతయా ప్రసిద్ధాస్తే తే సర్వేపి పరమాత్మవాచకా ఏవేత్యయం నామప్రపఞ్చారోపో బ్రహ్మణి వేద్యమ్ః ఉమా బ్రహ్మవిద్యా, శ్రీర్మాయాకంఠే కంఠవద్బ్రహ్మైకదేశే అస్తీతి శ్రీకంఠః. త్రీణి ఇన్ద్రియం మనోమాయాచేతి నేత్రాణి నేత్రవదుపలబ్ధిసాధనాని యస్య సః త్రినేత్రః. నిగమధ్వజః వేదయోనిత్వాదితి భావః నిగమైర్హి ధ్వజేన రాజేవ జ్ఞాప్యతే పరమాత్మా పీతం గ్రస్తం అమ్బరం ఖం యేన పీతామ్బరః గగనవ్యాపీ. రంగం జగద్రూపం నాటకస్థానం నటో జగన్నాటకసూత్రధారః.

**అనువాదం :** 'అధ్యారోపం, అపవాదముల వలన ప్రపంచాతీతమయినది ప్రపంచింప బడుచున్నది' అన్న న్యాయం వలన, ఇంతవఱకు రూపప్రపంచం అంతటిని బ్రహ్మయందు ఆరోపించి నామములు రచియింపబడినవి. ఇక రకరకాల దైవనామములను బ్రహ్మయందు ఆరోపించి సర్వము బ్రహ్మతత్త్వమని నిరూపించుచు నామములు చెప్పబడుచున్నవి. ఇక చెప్పబోయే పార్వతీపతి మొ॥ దేవతలకు పేర్లుగా ప్రసిద్ధమయిన నామములు అన్నియు పరమాత్మనే చెప్పునని 'నామప్రపంచారోపం' చేయబడుచున్నది.

ఉమా అనగా బ్రహ్మవిద్య. శ్రీ అనగా మాయ. ఈ మాయ కంఠమున అనగా బ్రహ్మములో కంఠము వంటి ఒక చిన్న ప్రదేశము కలదు కనుక శ్రీ కంఠః అని పేరు. 'ఇంద్రియము, మనస్సు, మాయ' అని '3' నేత్రములు గలవాడు అనగా నేత్రముల వంటి ప్రాప్తిసాధనములు గలవాడు కనుక త్రిలోచనుడు. వేదకారణం కనుక నిగమధ్వజః అని పేరు. ధ్వజం అనగా జెండా ఒక రాజును గూర్చి తెలిపినట్లు వేదములు పరమాత్మను గూర్చి తెలుపును. అంబరం అనగా ఆకాశమును త్రాగిన వాడు అనగా వ్యాపించినవాడు కనుక 'పీతాంబరః' అని పేరు. గగన వ్యాపి. రంగం అనగా ప్రపంచము అనే రంగస్థలమునకు నాథుడు కనుక "రంగనాథః" అని పేరు. నటేశ్వరుడు అనగా ప్రపంచము అనే నాటకమునకు సూత్రధారుడు కనుక నటేశ్వరుడు.



విగతో నాయకో యస్మాత్స వినాయకః. ధర్మస్య రాజా ధర్మరాజః. ఖం నభః.

**అనువాదం :** వినాయకః=నాయకుడు లేనివాడు. ధర్మమునకు రాజుకనుక ధర్మరాజు. ఖం అనగా ఆకాశసదృశుడు.

**వివరణ :** సర్వధర్మములకు అనగా కర్తవ్యాకర్తవ్యములకు, శీతోష్ణాది ధర్మములకు, అటువంటి శరీరాది ధర్మములకు 'ఆత్మ'–కారణం కనుక 'ధర్మరాజు'. ఆత్మ అనగా చైతన్యం. అది లేనిదే శరీర ధర్మములు మొ॥ సాగవు.

**శ్లో॥ ద్వ్యాత్మా త్ర్యాత్మా చతుర్వ్యూహః పఞ్చాత్మా షడ్విధాకృతిః।**
**సప్తాత్మాష్టవిధః కిఞ్చ నవాత్మా దశధాస్థితః॥ 37**

'మాయా బ్రహ్మచేతి ద్వౌ జీవేశ్వరౌ వా, బ్రహ్మవిష్ణురుద్రాస్త్రయః' వాసుదేవసఙ్కర్షణ ప్రద్యుమ్నానిరుద్ధాశ్చత్వారః, పఞ్చ విషయాః, షడిన్ద్రియాణి పఞ్చాన్తః కరణమేకమ్, సప్త వాయవః, అష్ట వసవః, నవ ప్రజాపతయః, దశ ప్రాణాః.

**అనువాదం :** 'మాయ–బ్రహ్మ' అని లేదా జీవుడు–ఈశ్వరుడు, '2' రకములు ప్రధాన భేదములు కనుక 'ద్వ్యాత్మా' అని పేరు. బ్రహ్మవిష్ణురుద్రులు అని '3' భేదములు కనుక 'త్ర్యాత్మ' అని పేరు. 'వాసుదేవసంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ' అని 4 భేదములు కనుక 'చతుర్వ్యూహః' అని పేరు. ఇంద్రియ విషయాలు '5' కనుక పంచాత్మ. ఇంద్రియాలు+మనస్సు–6 కనుక 'షడ్విధాకృతిః' అని పేరు. 7 వాయువులు కనుక సప్తాత్మ. 8 వసువులు కనుక 'అష్టవిధః' అని పేరు. ప్రజాపతులు 9 కనుక 'నవాత్మ' అని పేరు. ప్రాణాలు 10 కనుక 'దశాత్మ' అని పేరు.

**వివరణ :** వాస్తవముగా ఉన్నది బ్రహ్మం. దానికి శక్తి ఉన్నది. కనుక 'శక్తి' గూడా బ్రహ్మలోని భాగమే. ఈ శక్తి తన మాయా వైభవముతో ప్రపంచాన్ని విస్తరించినది. ఇందులో చైతన్యరూపంగా 'బ్రహ్మం' ఉన్నది. కనుక 'మూలం' శక్తి అంతా బ్రహ్మమే. కాగా ఈ ప్రపంచంలో మనం ఎన్ని విభాగాలు చేసినా

అదంతా బ్రహ్మమే కాని వేఱే పదార్థంకాదు. కాని మన దృష్టిలోని విభాగాలను అన్నింటిని చెప్పి 'ఆ భేదాలన్ని బ్రహ్మమని చెప్పటం ద్వారా ఈ నామాలు ఏర్పడినవి. తరువాత వచ్చే శ్లోకాలలో నామాలు గూడా ఈ విధంగా ఏర్పడినవే.

**శ్లో॥ ఏకాదశాత్మా చ పునర్ద్వాదశాత్మా త్రయోదశః।**
**చతుర్దశాత్మా భగవాంస్తథా పఞ్చదశాత్మకః॥ 38**

ఏకాదశరుద్రాః, ద్వాదశాదిత్యాః, త్రయోదశ ప్రకృతిమహదహంకారాః పఞ్చతన్మాత్రాణి పఞ్చ మహాభూతాని చ; చతుర్దశ మనవః, పఞ్చదశ భూతేన్ద్రియ ప్రాణపఞ్చకత్రయమ్.

**అనువాదం :** ఏకాదశ రుద్రులు కనుక ఏకాదశాత్మ, ద్వాదశాదిత్యులు కనుక ద్వాదశాత్మ. ప్రకృతి, మహత్, అహంకారం, పంచ తన్మాత్రలు, పంచభూతములు =13 కనుక త్రయోదశాత్మ, 14మంది మనువులు కనుక చతుర్దశాత్మ, 5 భూతాలు, 5 ఇంద్రియాలు 5 ప్రాణాలు=15 కనుక పంచదశాత్మ.

**శ్లో॥ అష్టాదశాత్మా చ చతుర్వింశత్యాత్మా శతాత్మకః।**
**సహస్రాత్మాప్యనేకాత్మా కేవలాత్మా స్థిరాత్మకః॥ 39**

అష్టాదశవిద్యాశ్చతుర్వింశతి తత్త్వాని. శతమ్మఖా నాడ్యోవా సహస్రం సూర్యకిరణా దేవా ఇతి వా. వస్తుతస్తు కేవలాత్మా.

**అనువాదం :** 18 విద్యలు కనుక అష్టాదశాత్మ, 24 తత్త్వాలు=చతుర్వింశత్యాత్మ, యజ్ఞాలు 100. లేదా నాడులు 100. కనుక శతాత్మ, సూర్యకిరణాలు 1000 లేదా దేవతలు 1000 కనుక సహస్రాత్మ. వాస్తవముగా అంతా ఒక్కటే కనుక "కేవలాత్మ" అనియు పేర్లు. (సహస్రం అంటే 1000 లేదా చాలా అని అర్థం).

**వివరణ :** 24 తత్త్వాలు

**శ్లో॥ సాత్మా నిరాత్మా పూతాత్మా స్వతన్త్రాత్మాఽన్తరాత్మకః।**
**శాన్తాత్మా మఙ్గలాత్మా చ శాశ్వతాత్మా నిరాత్మకః॥ 40**



సాత్మా చేతనః. నిరాత్మా ఆత్మాన్తరరహితః దేహాత్మేన్ద్రియాత్మాదయో బహవ ఆత్మానః కల్పితాస్సన్తి. తే త్వపూతా అస్వతన్త్రా అశాన్తా అమఙ్గలా అశాశ్వతాశ్చ. తద్వ్యావృత్తయే ప్రాహ-పూతాత్మేత్యాది సర్వాత్మాన్తరత్వా దన్తరాత్మాయమ్. నాయమన్యస్యాత్మేత్యాహ-నిజాత్మక ఇతి. స్వస్యైవాత్మా స్వరూపమిత్యర్థః.

**అనువాదం :** ఆత్మ అనగా చైతన్యం. అదిగలవాడు కనుక సాత్మ. మఱియొక్క ఆత్మ లేదు కనుక 'నిరాత్మ'. దేహం ఆత్మ అని, ఇంద్రియాలు ఆత్మయని, ఇలా అనేక వాదాలు, అనేక ఆత్మలు ఉన్నాయి. కాని అవి అపవిత్రములు, అస్వతంత్రములు, శాంతి రహితములు, అమంగలములు. అశాశ్వతములు కాని పరమాత్మ అట్టివాడు కాదు. కనుక 'పూతాత్మ' మొ॥ పేర్లు కలవు. పైన చెప్పిన సమస్త-ఆత్మలలోను అంతర్యామిగా ఉండేవాడు కనుక అంతరాత్మ. తనకుతానే ఆత్మ కనుక 'నిజాత్మకః' అని పేరు.

**శ్లో॥ నీరస స్సరసో రస్యో రసికో రస ఏవ చ।**
**అయ మేష స యోఽసౌ కః। కోన్యోఽనన్యో భవానపి॥ 41**

ఉదకాదివన్నాయం రసగుణవానిత్యాహ-నీరస ఇతి ఆత్మరసాను భావినామన్యత్రానాదరాదాహ, సరస ఇతి. 'రసో వై స' ఇతి శ్రుతేరాహ-రస ఇతి. ఇదమేతత్తద్యదదః కిమన్యభవచ్ఛబ్దవాచ్యం వస్తు సర్వమయమేవేత్యాహ-అయమిత్యాది. క ఇత్యాత్మ వాచీ శబ్దః. అనన్యః యస్మాదన్యన్న విద్యతే సః.

**అనువాదం :** జలము వలె ఆత్మకు రసము లేదు. కనుక 'నీరసః' అని పేరు. 'ఆయనయే రసం' అని వేద వాక్యము కలదు. పైగా ఆత్మజ్ఞానము కలిగిన వారికి ఇతర రసములపై ఆసక్తి లేదు. కనుక 'ఆత్మ' 'సరసం' అని చెప్పవచ్చును. వాడు, వీడు, ఎవడు, ఇతరుడు నీవు మొ॥ పేర్లు గల పదార్థములన్నియు ఆత్మయే కనుక ఆత్మకు అయం, ఏషః మొ॥ పేర్లు తగియున్నవి. ఇందులో '2' కః అను పేర్లు కలవు. అందులో ఒక కః అను పదమునకు ఎవడు? అని అర్థము. మఱొక 'కః' అను శబ్దమునకు 'బ్రహ్మము' అని అర్థము. ఆయనకన్న ఇతరం లేదు కనుక 'అనన్యః' అని పేరు.

**శ్లో॥ ఉమాసహాయ శ్శ్రీకంఠ స్త్రినేత్రో నిగమధ్వజః।**
**పీతామ్బరో జగన్నాథో రఙ్గనాథో నటేశ్వరః॥ 42**



## నివాళి

పంగనామములద్ది 'వైష్ణవరాముడై'
తులసీవనములోన నిలిచినాడు,
శాస్త్రసాహితులలో ఛాత్రాభిరాముడై
'గురు చక్రవర్తియై' మెఱసినాడు,
అల, శ్మశానము వద్ద 'అలరు చింతల' మధ్య
బ్రహ్మచింతనతోడ పఱగినాడు,
శ్రీ హయగ్రీవుని చిత్తమ్ములో నిల్పి
'నిర్మల స్ఫటికమై' నిలిచినాడు,
అట్టి 'బెల్లపుగొండ' ను పట్టి నట్టి
పమిడిపాటికి 'చీమనై' ప్రణతి సేతు
అట్టి మహనీయుడైన 'బ్రహ్మణ్యమూర్తి'
తనువు తాకిన 'శేషుబావి' ని దలంతు.

న స్తౌమి కృష్ణం న చ శఙ్కరం వా
న స్తౌమి చాహం మధుసూదనం వా।
సంస్తౌమి రామం దశపద్యభాష్య
గతార్థసారీకృతవేదశాస్త్రమ్।

మేళ్ళచెర్వు

శ్రీః

# శ్రీపరమాత్మసహస్రనామావళీస్తోత్రమ్

సంస్కృతమూలమ్ వ్యాఖ్యా చ
శ్రీ బెల్లంకొండ రామరాయవిద్వత్కవిః
అనుసంధానమ్ (ఆంధ్రానువాద వ్యాఖ్యా)
శ్రీ మేళ్ళచెఱ్ఱువు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రీ






ప్రకాశికా
**రావి కృష్ణకుమారి**
4-103, ఐ.ఎల్.టి.డి. కాలనీ ఎక్స్‌టెన్షన్,
కొత్తపేట-చీరాల-523 157



## నివాళి

పంగనామములద్ది 'వైష్ణవరాముడై'
తులసీవనములోన నిలిచినాడు,
శాస్త్రసాహితులలో ఛాత్రాభిరాముడై
'గురు చక్రవర్తియై' మెఱసినాడు,
అల, శ్మశానము వద్ద 'అలరు చింతల' మధ్య
బ్రహ్మచింతనతోడ పఱగినాడు,
శ్రీ హయగ్రీవుని చిత్తమ్ములో నిల్పి
'నిర్మల స్ఫటికమై' నిలిచినాడు,
అట్టి 'బెల్లపుగొండ' ను పట్టి నట్టి
పమిడిపాటికి 'చీమనై' ప్రణతి సేతు
అట్టి మహనీయుడైన 'బ్రహ్మణ్యమూర్తి'
తనువు తాకిన 'శేషుబావి' ని దలంతు.

న స్తౌమి కృష్ణౌ న చ శఙ్కరం వా
న స్తౌమి చాహం మధుసూదనం వా।
సంస్తౌమి రామం దశపద్యభాష్య
గతార్థసారీకృతవేదశాస్త్రమ్।

మేళ్ళచెర్వు

శ్రీః

# శ్రీపరమాత్మసహస్రనామావళీస్తోత్రమ్

సంస్కృతమూలమ్ వ్యాఖ్యా చ
శ్రీ బెల్లంకొండ రామరాయవిద్వత్కవిః
అనుసంధానమ్ (ఆంధ్రానువాద వ్యాఖ్యా)
శ్రీ మేళ్ళచెఱ్వు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రీ





ప్రకాశికా
**రావి కృష్ణకుమారీ**
4-103, ఐ.ఎల్.టి.డి. కాలనీ ఎక్స్‌టెన్షన్,
కొత్తపేట-చీరాల-523 157



## నివాళి

పంగనామములద్ది 'వైష్ణవరాముడై'
తులసీవనములోన నిలిచినాడు,
శాస్త్రసాహితులలో ఛాత్రాభిరాముడై
'గురు చక్రవర్తియై' మెఱసినాడు,
అల, శ్మశానము వద్ద 'అలరు చింతల' మధ్య
బ్రహ్మచింతనతోడ పఱగినాడు,
శ్రీ హయగ్రీవుని చిత్తమ్మలో నిల్పి
'నిర్మల స్ఫటికమై' నిలిచినాడు,
అట్టి 'బెల్లపుగొండ' ను పట్టి నట్టి
పమిడిపాటికి 'చీమనై' ప్రణతి సేతు
అట్టి మహనీయుడైన 'బ్రహ్మణ్యమూర్తి'
తనువు తాకిన 'శేషుబావి' ని దలంతు.

న స్తౌమి కృష్ణం న చ శఙ్కరం వా
న స్తౌమి చాహం మధుసూదనం వా।
సంస్తౌమి రామం దశపద్యభాష్య
గతార్థసారీకృతవేదశాస్త్రమ్।

మేళ్ళచెర్వు

శ్రీః

# శ్రీపరమాత్మసహస్రనామావలీస్తోత్రమ్

సంస్కృతమూలమ్ వ్యాఖ్యా చ
శ్రీ బెల్లంకొండ రామరాయవిద్వత్కవిః
అనుసంధానమ్ (ఆంధ్రానువాద వ్యాఖ్యా)
శ్రీ మేళ్ళచెర్వు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రీ






ప్రకాశికా
**రావి కృష్ణకుమారీ**
4-103, ఐ.ఎల్.టి.డి. కాలనీ ఎక్స్‌టెన్షన్,
కొత్తపేట-చీరాల-523 157



## నివాళి

పంగనామములద్ది 'వైష్ణవరాముడై'
తులసీవనములోన నిలిచినాడు,
శాస్త్రసాహితులలో ఛాత్రాభిరాముడై
'గురు చక్రవర్తియై' మెఱసినాడు,
అల, శ్మశానము వద్ద 'అలరు చింతల' మధ్య
బ్రహ్మచింతనతోడ పఱగినాడు,
శ్రీ హయగ్రీవుని చిత్తమ్ములో నిల్పి
'నిర్మల స్ఫటికమై' నిలిచినాడు,
అట్టి 'బెల్లపుగొండ' ను పట్టి నట్టి
పమిడిపాటికి 'చీమనై' ప్రణతి సేతు
అట్టి మహనీయుడైన 'బ్రహ్మణ్యమూర్తి'
తనువు తాకిన 'శేషుబావి' ని దలంతు.

న స్తౌమి కృష్ణ్ం న చ శఙ్కరం వా
న స్తౌమి చాహం మధుసూదనం వా।
సంస్తౌమి రామం దశపద్యభాష్య
గతార్థసారీకృతవేదశాస్త్రమ్।

మేళ్ళచెర్వు

శ్రీః

# శ్రీపరమాత్మసహస్రనామావలీస్తోత్రమ్

సంస్కృతమూలమ్ వ్యాఖ్యా చ
శ్రీ బెల్లంకొండ రామరాయవిద్వత్కవిః
అనుసంధానమ్ (ఆంధ్రానువాద వ్యాఖ్యా)
శ్రీ మేళ్ళచెఱ్వు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రీ



ప్రకాశికా
**రావి కృష్ణకుమారి**
4-103, ఐ.ఎల్.టి.డి. కాలనీ ఎక్స్‌టెన్షన్,
కొత్తపేట-చీరాల-523 157



తాతయ్య, అమ్మమ్మల
(తాడికొండ వాస్తవ్యులు **దొప్పలపూడి నాగయ్య, మహాలక్ష్మి**)
దివ్యస్మృతికి నమస్సులతో సమర్పితం.

**– రావిమోహనరాయః**

త్వరలో...

శ్రీః

మహాకవి శ్రీ కాళిదాసప్రణీతమ్

# మేఘదూతమహాకావ్యమ్

సంస్కృతవ్యాఖ్యాత్రయ(**వల్లభదేవ–మల్లినాథ–పూర్ణసరస్వతి**)
సముల్లసితం ఆన్ధ్ర **'మృణాళినీ'** వ్యాఖ్యా చ
(పదవిభాగ–ప్రతిపదార్థ–తాత్పర్య–పదాదర్శమ్)

**రావిమోహనరాయః,** ఎమ్.యస్.సి., ఎమ్.ఏ.,*(సంస్కృతమ్)*
భూవిజ్ఞానశాస్త్ర శాఖ–సెలక్షన్ గ్రేడ్ లెక్చరర్
వి.ఆర్.యస్.&వై.ఆర్.యన్. కాలేజి, చీరాల–523 157